# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# సౌఖ్యానికి సేతువులు

పంచవర్ష ప్రణాళికలవల్ల అర్థికప్రగతికి రాచబాట ఏర్పడింది. అర్థిక స్వయంపోషకత్వానికి పునాది పడింది. వ్యవసాయం జీవితమైతే, పరిశ్రమలు జీవిత సౌఖ్యానికి సేతువులు. పొలాలలో అరకలు సాగితే, ఫ్యాక్టరీలలో మరచక్రాలు తిరిగితే, జాతిప్రజల జీవితం పచ్చ పచ్చగా వుంటుంది. సుఖప్రదమైన జీవితాన్ని సాధించడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం అవిరళంగా కృషి చేస్తున్నది.

మూడో ప్రణాళికలో పరిశ్రమలకోసం ఖర్చు ౧౬.౮౨ కోట్లు, రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి కార్పొరేషన్ వారు హెచ్. డి., యల్. డి. ఇన్సులేటర్ల నిర్మాణాన్ని, సమన్విత గాజు పరిశ్రమనూ, బాల్ బేరింగ్స్ పరిశ్రమనూ, పిగ్ ఐరన్ పరిశ్రమనూ చేపట్టి నిర్వహిస్తున్నారు.

లఘు పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్ వారు రు. ౭౫ లక్షల విలువ గల ముడి పదార్థాలను సేకరించి పరిశ్రమదారులకు వాటిని కంట్రోలు ధరలకు అందించారు.

రు. ౨౦ కోట్లు ఖర్చుతో స్థాపించిన సింథెటిక్ మందుల ఫ్యాక్టరీ, రు. ౩౫ కోట్లతో స్థాపించిన హెవీ ఎలెక్ట్రికల్స్ ఫ్యాక్టరీ—యీ రెండు బృహత్పరిశ్రమలు కేంద్ర ప్రభుత్వ రంగంలో మన రాష్ట్రంలో స్థాపించబడినవి. వీటివల్ల త్వరలోనే మన రాష్ట్ర అర్థిక రంగంయొక్క రూపురేఖలు మారిపోతాయి. హిందూస్థాన్ యంత్ర పరికరాల సంస్థయొక్క ఐదవ విభాగం, డిఫెన్స్ ఎలక్ట్రానిక్స్ ఫ్యాక్టరీ కూడా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో నెలకొల్పాలని నిశ్చయం జరిగింది.

అశాజనకమైన భవిష్యత్తులోకి ప్రగతి పథాన పయనిద్దాం.




1. వి సుబ్రమణ్యం, నెల్లాట్రూరు

అనయ్యా, మీకు వచ్చిన ప్రశ్న లన్నిటికీ సమాధానా లిస్తారా?
అసంభవం.

2. ఎం. నారాయణ, మాణిక్యమ్మగూడ

అన్నయ్య, "నెహ్రూ కథ" [జూలై] యందు మోతీలాల్ నెహ్రూ అన్న నందలాల్ నెహ్రూ అని వ్రాశారు. మరి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు ప్రచురించిన ఆరవ తరగతి తెలుగు వాచకములో "మన భారత ప్రధాని" పాఠమందు మోతీలాల్ నెహ్రూ పెదతండ్రి నందలాల్ నెహ్రూ యని ప్రచురించారు. ఈ విషయ మేమిటో వివరిస్తారా?

మోతీలాల్ అన్నగారు నందలాల్ అన్నది నిజం. మోతీలాల్‌కు నందలాలనే పెత్తండ్రి ఉన్నట్లు జవాహర్‌లాల్ ఆత్మకథలో ఎక్కడా లేదు.

3. ఎస్. మోహన కృష్ణమూర్తి, గొల్లపూడి

ఓ మామా, అభిరామస్వామి వీరేంద్రుడితో ["దుర్గేశనందిని" జూలై] "మాన సింహుడు నీకు చేసిన అపరాధానికి తప్పక శిక్షించవలసినదే" (అని ఉన్నది). చేసిన అపరాధ మేమిటో తెలియజేస్తారా?

"దుర్గేశనందిని"లో ఇటువంటి అనుమానాలు చాలా పుట్టుకొస్తాయి. నవల పూర్తిగా చదివితే గాని అవి తేలవు.

4. ఆర్. రాధాకృష్ణ, విశాఖపట్నం

అన్నయ్యా, ఎవరైనా కథలు "చందమామ"కు పంపిస్తే వారికి ఏమిటిస్తారు? డబ్బు ఇస్తారా?

కథలు పంపినందు కేమీ ఇవ్వం, వేసుకుంటే డబ్బిస్తాం.

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ :





"సుఖపడదామని
కొడుకు
యింటికి వెళ్లినా
నా వంటపని
నాకు
తప్పలేదు!"

మా అబ్బాయిని, కోడలు సీతను చూసి రెండేళ్ళు అయింది. వాళ్ళను చూడ్డానికి ఎంతో ఆశగా వెళ్ళేను. కాని వాళ్ళ యిల్లు చిందరవందరగాను, పిల్లలు చింపిరి జుట్టులతోను ఉండేసరికి నాకు అక్కడ చేతినిండా పని తగిలింది! ఒక రోజున సీత నాతో యిలా అంది. "అత్తయ్యా, ఒంట్లో ఓపికలేక ఏ పనీ చేసుకోలేకుండా ఉన్నాను. నాకు ఏమి చేయాలో తెలీకుండా ఉంటుందండీ!"



నేను యిలా అన్నాను. "పదమ్మా, డాక్టరు దగ్గరకు వెడదాము." డాక్టరుగారు అన్నీ కనుక్కొని యిలా అన్నారు. సీతకు కావలసినంత పోషణ లభించడము లేదు. అందుకనే ఈమె త్వరగా అలసిపోతోంది. రోజూ హార్లిక్స్ త్రాగితే సరిపోతుంది!



హార్లిక్స్ త్రాగి సీత మళ్ళీ ఉత్సాహముగా కనపడింది. గోధుమ పిండి, మాల్టెడ్ బార్లీల పోషణతో కూడిన, శ్రేష్ఠమైన డెయిరీ పాలతో హార్లిక్స్ తయారవుతుంది. హార్లిక్స్ తప్పకుండా పనిచేస్తుంది!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

SWT/HL-



# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంకాదు

సీతాకోక చిలుకలు ఎట్లు జీవిస్తున్నాయో ఈనాడు ఆమె తెలుసుకుంటున్నది. ప్రతిరోజూ జీవితమును గురించి ఆమె ఎక్కువగా తెలుసుకుంటున్నది. పళ్ల, పనుచిగుళ్ల భద్రతపట్ల రోజూ శ్రద్ధ వహించవలసిన విషయం కూడ మీరు ఆమెకు బోధించాలి. ఆమెకు వృద్ధాప్యంలో కూడ సహజమైన పళ్లుంటవి. మీ వివేకమును ఆమె సర్వదా స్మరించుకుంటూ, దంతక్షయం, పనుచిగుళ్ల బాధల బారినుండి తనను రక్షించినందుకు మీకు అభివందనాలు అర్పించుతుంది. మీ పిల్లలకు వారెప్పటికైనా నేర్చుకోవలసిన అత్యుత్తమమైన అలవాట్లను ఈనాడె బోధించండి- ఫొర్‌హన్స్' టూత్ పేస్టుతో రోజూ పళ్లు, పనుచిగుళ్లను తోముకుంటూ వుండాలి. అమెరికా యందలి దంతవైద్యుడు డాక్టర్ జె. ఆర్. ఫొర్‌హన్‌చే సృష్టించబడిన ఫొర్‌హన్స్' టూత్ పేస్టు ఒక్కటే ప్రపంచములో ఆరోగ్యవంతమైన గట్టి పనుచిగుళ్లకు, మెరిసే తెల్లని పళ్లకు అనుకూలించే ప్రత్యేక పదార్థములు గలది. ఆర్. జె. ఫొర్‌హన్, డి. డి. ఎస్. చికిత్సననుసరించిన "CARE OF THE TEETH AND GUMS" (ఇంగ్లీషులో) తపాలా ఖర్చుల నిమిత్తం 15 న. పై. తపాలా బిళ్లలను పంపండి: ఫొర్‌హన్స్' డెంటల్ ఎడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం. 10031, బొంబాయి-1.

## COUPON

Please send me a copy of
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ..........................................

*Address* ..........................................

C.1 ..........................................







# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మానవులకు చంద్రుడంటే చాలా ఇష్టం. ప్రతి కవీ చంద్రుణ్ణి వర్ణించాడు. ఆడవాళ్ళ ముఖాలను చంద్రుడితో పోల్చారు. ప్రీతి పాత్రుడైన రాముణ్ణి రామచంద్రుడన్నారు.

చంద్రుడిపై గల మానవుల అభిమానం ఇటీవల క్రియా రూపం పొందుతున్నది. కొంత కాలంక్రితం రష్యనులు చంద్రుడి వెనక భాగాన్ని ఫొటోగ్రాఫు చేశారు. ఇప్పుడమెరికనులు చంద్రుడి ముందు భాగానికి ఫొటోలు తీశారు.

సంపుటి 35 సెప్టెంబర్ 1964 సంచిక 3







# భారత చరిత్ర




ఒరిస్సా

సుమారు 1076 నుంచి 1148 దాకా పరిపాలించిన చోడగంగ అనంతవర్మ కింద ఒరిస్సా శక్తివంతమైన రాజ్యంగా రూపొందింది. ఆ రాజ్యం గంగా ముఖం నుంచి దక్షిణాన గోదావరీ ముఖం దాకా వ్యాపించి ఉండినట్టు శాసనాలు చెబుతున్నాయి. చోడ గంగు మతాన్నీ, సంస్కృతాంధ్ర సాహిత్యాలనూ పోషించాడు. ఆయన పరిపాలనలో ఒరిస్సా సాధించిన ఉన్నతికి పూరీ జగన్నాథాలయమే సాక్షి.

ఆయన తరువాత వచ్చినవారు ముస్లిము దాడులను నిరోధించి, ఒరిస్సా సంపదను నిలబెట్టారు. వారిలో ప్రఖ్యాతుడు మొదటి నరసింహుడు (1238-1264) ఆయన బెంగాలు ముస్లిముల పై విజయం సాధించాడు; జగన్నాథాలయ నిర్మాణం పూర్తి చేసి, కోణార్కలో సూర్యాలయం కూడా నిర్మింప జేశాడు. ఆయన అనంతరం గంగ వంశం క్రమంగా నీరసించి సూర్య వంశపు రాజులు వచ్చారు.

ఈ కొత్త వంశానికి మూల పురుషుడు కపిలేంద్రుడు. గంగ రాజుల కాలంలో దిగజారిన కీర్తి ప్రతిష్ఠలను ఇతను తిరిగి నిలబెట్టాడు; తిరుగుబాటులను అణచాడు; బలవంతులైన బీదరు బహ్మనీ రాజులనూ, విజయనగర రాజులనూ జయించాడు; తన రాజ్యాన్ని గంగ నుంచి కావేరి దాకా విస్తరింపజేశాడు. గోపీనాథపుర శాసనంలో ఆయన ఉదయగిరినీ, కంజీవరాన్నీ పట్టుకున్నట్టున్నది.

ఆయన తరవాత వచ్చిన పురుషోత్తముడి (1470-1497) పాలనలో కలతలు ఏర్పడి, గోదావరి దిగువనున్న సగం రాజ్యం జారి పోయింది. కృష్ణకు దక్షిణంగా ఉన్న ప్రాంతాన్ని సాళువ నరసింహుడూ, కృష్ణా

గోదావరీ మధ్య దేశాన్ని బహ్మనీ రాజులూ కాజేశారు. అయితే పురుషోత్తముడి చివరి కాలంలో బహ్మనీ రాజులు తీసుకున్నదీ, కృష్ణకు దక్షిణంగా ఉండే ప్రాంతంలో నేటి గుంటూరు జిల్లా వరకూ తిరిగి ఒరిస్సాకు లభించాయి.

పురుషోత్తముడి కొడుకు ప్రతాపరుద్రుడు (1497-1540) చైతన్యుడికి శిష్యుడూ, సమకాలికుడూనూ. ఇతను రాజ్యానికి వచ్చిన నాటి ప్రాంతాలు కొన్ని దక్కకుండా పోయాయి. ఇందుకు ఒక కారణం విజయ నగర రాజు కృష్ణదేవరాయలూ, గోలకొండ కుతుబ్ షాహీ నవాబులూ చేసిన దాడులు. మూడు యుద్ధాల అనంతరం గోదావరికి దక్షిణంగా ఉన్న ఒరిస్సా రాజ్య ప్రాంత మంతా కృష్ణదేవరాయల దయింది. 1522లో గోలకొండ కులీ కుతుబ్ షా ఒరిస్సా పై దాడి చేశాడు.

చైతన్య స్వామి బోధించిన వైష్ణవంకూడా ఒరిస్సా పాలకులూ, ప్రజలూ నిర్వీర్యులు కావడాని కొక కారణ మంటారు. ఏమైనా 16వ శతాబ్ది ఆరంభం నుంచి ఒరిస్సా ప్రతిభ క్షీణించింది.

1541-42లో కపిలేంద్రుడి వంశంస్థానే భోయివంశం వారు రాజు లయారు. భోయి



అంటే రచయిత. ఈ వంశానికీ పేరు రావటానికి దీని మూల పురుషుడు గోవిందుడు కారణం. ఇతనూ, ఇతని కొడుకూ, ఇద్దరు మనమలూ కలిసి ఒరిస్సాను సుమారు 18 ఏళ్ళు పాలించిన పిమ్మట ఈ వంశాన్ని తొలిగించి సుమారు 1559లో ముకుంద హరిచందనుడు రాజయాడు. 1568లో చని పోయే దాకా ఇతను ముస్లిము దాడులను ప్రతిఘటించాడు.

బెంగాలులోని అఫ్ఘాను పాలకులను రెండు పక్కల నుంచి దెబ్బ తీయాలనే ఉద్దేశంతో అక్బరు పాదుషా ముకుందహరి చందనుడితో మైత్రి కోరాడు.

రాజపుత్రుల అనన్య ఖ్యాతికి పుట్టినిల్లు మేవాడ్. అక్కడ ఎందరో పరాక్రమవంతులూ, రణకుశలులూ, నాయకులూ, పాలకులూ, గొప్ప కవులూ జన్మించారు. మేవాడ్‌లో సుప్రసిద్ధమైనది గుహిల రాజపుత్రవంశం. 7 వ శతాబ్ది నుంచీ వారి ప్రభ ఇక్కడ వెలుగుతూ వచ్చింది.

ఢిల్లీ సామ్రాజ్య విచ్ఛిత్తి కాలంలో అనేక రాజపుత్ర సంస్థానాలలో పునరుజ్జీవ కాంక్ష మొలకెత్తింది. చితోడ్‌కు అలాఉద్దీన్ ఖల్జీ చేసిన అవమానాన్ని కడిగేసి కీర్తిని తిరిగి సంపాదించుకున్నాక మేవాడ్‌కు చిరకీర్తి తెచ్చినవాడు కుంభరాణా. ఇతను భారత చరిత్రలోనే సుప్రసిద్ధుడు. ఇతను మాల్వా, గుజరాతులను ఏలే ముస్లిము పాలకులతో యుద్ధాలు చేశాడు. ఇతను ప్రతి యుద్ధంలోనూ గెలవక పోయినా తన కున్నది నిలబెట్టుకో గలిగాడు. మేవాడ్ రక్షణకు గాను నిర్మించిన 84 దుర్గాలలో 32 కుంభరాణా నిర్మించినవే. ఇతను నిర్మించిన వాటిలో ప్రశంసనీయమైనది కుంభలగఢ్ దుర్గమూ, జయ స్తంభమూనూ.

కుంభరాణా కవి, పండితుడు. గొప్ప గాయకుడు. 1469 ప్రాంతంలో ఇతని కొడుకు ఇతన్ని హత్య చేశాడు.

సంగ్రామరాణా (లేక సంగరాణా) కుంభరాణా మనమడు. 1509 ప్రాంతంలో ఇతను మేవాడ్‌కు రాజయాడు. ఇతను మహా యోధుడు. ఇతనికి ఒక కన్నూ, ఒక కాలూ పోవటమేగాక, శరీరం మీద 80 గాయాలుండేవి. ఇతను మాల్వా, ఢిల్లీ, గుజరాతులతో యుద్ధం చేసి విజయాలు సాధించాడు. మేవాడ్ ఉన్నతి కోసం ఇతను కృషి చెయ్యటంతో ఇతనికీ ఇతరులకూ పోటీ సంభవించింది. ఈ పోటీ ఫలితమే ఖానువ యుద్ధం. దీన్ని గురించి ముందు ముందు తెలుసుకుంటాం.



# నెహ్రూ కథ

## 3



జవాహర్ పదో ఏట మోతీలాల్ కుటుంబం ఉంటున్న ఇంటి నుంచి ఇంకా చాలా పెద్ద ఇంటికి మారారు. ఈ ఇంటో పెద్ద తోట ఉండేది. ఒక క్రీడా సరస్సు కూడా ఉండేది. ఈ కొత్త ఇంటి ఆవరణలో జవాహర్‌కు ఎన్నో కొత్త కొత్త వింతలు ఎప్పటికప్పుడు కనపడేవి. ఈ ఆవరణలో కొత్త కట్టడాలు కూడా కట్టించారు. పనివాళ్ళు వచ్చి పునాదులు తవ్వటమూ, గోడలు కట్టటమూ చూస్తూ ఉంటే జవాహర్‌కు ఎంతో సరదాగా ఉండేది.

ఈ కొత్త ఇంటికి మోతీలాల్ "ఆనంద భవనం" అని పేరు పెట్టాడు.

జవాహర్ తమ ఆవరణలో ఉన్న క్రీడా సరస్సులో ఈతలు కొట్టటం నేర్చుకున్నాడు. ఈతలు కొట్టటం అతనికి సరదాగా ఉండేది. ముఖ్యంగా వేసవి కాలంలో బుద్ధి పుట్టినప్పుడల్లా నీటిలో దిగి, గంటల తరబడి ఈదులాడే వాడు. దానికి వేళా పాళా అంటూ ఉండేదికాదు.

ఈ క్రీడా సరస్సు దగ్గిరికి సాయంకాలం పూట మోతీలాలూ, అసంఖ్యాకులైన ఆయన మిత్రులూ వచ్చేవారు. ఆ క్రీడా సరస్సు దగ్గిర విద్యుద్దీపాలు కూడా ఏర్పాటు చేశారు. ఆ రోజుల్లో అలహాబాదులో విద్యుద్దీపాలు ఒక వింతగా ఉండేవి. సాయంకాలంపూట పెద్దవాళ్ళు క్రీడా సరస్సులో ఈదులాడటం చూస్తుంటే జవాహర్‌కు చాలా ఆనందంగా ఉండేది. ఈత రాని వాళ్ళను నీటిలోకి బలవంతాన లాగటమూ, తొయ్యటమూ చేసేవారు. నానా గొడవగా ఉండేది. డాక్టర్ తేజ్ బహదుర్ సప్రూ ఆ రోజుల్లో అలహాబాదు హైకోర్టులో జూనియరుగా ప్రాక్టీసు చేసేవాడు. ఆయనకు ఈత బొత్తిగా రాదు, నేర్చుకుందామనే ఉద్దేశం కూడా లేదు. ఆయన పదిహే నంగుళాల లోతు



నీటిలో ఉండే మెట్టు మీద కూర్చుని, కింది మెట్టుకు దిగమన్నా దిగేవాడు కాడు. ఎవరన్నా దగ్గిరికి వస్తే గట్టిగా అరిచేవాడు. మోతీలాలు కూడా ఈత రాదు, అయితే ఆయన పళ్ళ బిగువున క్రీడా సరస్సు ఒక చివర నుంచి మరొక చివరకు ఈది, విప రీతంగా అలిసిపోయేవాడు.

ఆ రోజుల్లోనే జవాహర్ కొక బుల్లి చెల్లెలు పుట్టింది. అంతదాకా అతను తన కొక తమ్ముడో, చెల్లెలో లేనందుకు చాలా బాధ పడేవాడు. తనకు తప్ప అందరికీ తమ్ముళ్లూ, చెల్లెళ్లూ ఉంటా రనుకునేవాడు. ఆ కోరిక ఇప్పుడు తీరింది. పురుడు వచ్చే సమయానికి మోతీలాల్ యూరప్‌లో ఉన్నాడు. ఏం పిల్ల పుట్టుతుందో నని ఆదుర్దాగా జవాహర్ వరండాలో వేచి ఉండగా డాక్టరొకడు వచ్చి, ఛలోక్తిగా కాబోలు, "చెల్లెలే పుట్టింది. నీ ఆస్తిలో భాగం పంచుకునే తమ్ముడు కాడులే, భయపడకు," అన్నాడు. తనకు అలాటి నీచపు బుద్ధు లుంటాయని ఇతరు లనుకోవటం చూసి జవాహర్‌కు కోపమూ, విచారమూ కలిగింది.

యూరపు వెళ్ళి వచ్చినందుకు మోతీ లాల్ ప్రాయశ్చిత్తం చేసుకోవాలని కొందరు కాశ్మీరీ బ్రాహ్మణు లన్నారు. మోతీలాల్ నిరాకరించాడు. అంతకు పూర్వం కొన్ని ఏళ్ళ క్రితం పండిత్ బిషన్ నారాయన్‌దార్ అనే మరో కాశ్మీరీ బ్రాహ్మడు లాయరు వృత్తిలో ప్రవేశించటానికి పూర్వం ఇంగ్లం డుకు వెళ్ళి వచ్చి ప్రాయశ్చిత్తం చేసు కున్నాడు. అయినప్పటికీ శ్రోత్రియులైన కాశ్మీరీ బ్రాహ్మణు లాయనను వెలివేశారు. దాంతో కాశ్మీరీ బ్రాహ్మణ కుటుంబాలలో రెండు "పార్టీ" లేర్పడ్డాయి. సగం మంది అటూ, సగం మంది ఇటూ చీలారు. కాని రాను రాను పాశ్చాత్య దేశాలలో చదువుకుని వచ్చే యువకుల సంఖ్య పెరిగింది. వారు స్వదేశానికి తిరిగి వచ్చి "సంస్కారుల"తో

చేరిపోసాగారు. కాని వారు ప్రాయశ్చిత్తపు తంతు మానలేదు. ఆ ప్రాయశ్చిత్తం కూడా ఒక ప్రహసనం లాటిది; అందులో మత ప్రమేయ మేమీలేదు. శ్రోత్రియుల కళ్ళ నీళ్ళు తుడవటానికి వారు ప్రాయశ్చిత్తం చేసుకునే వారేగాని, ఆ తరవాత ఆచార విరుద్ధమైన పనులన్నీ చెయ్యనే చేసేవారు.

మోతీలాల్ వాళ్ల కన్న ఒక్క అడుగు ముందుకు వెళ్ళి ప్రాయశ్చిత్తమే చేసుకో నన్నాడు. పై పెచ్చు తనను ప్రాయశ్చిత్తం చేసుకోమన్న వారిని పురుగుల్ని చూసినట్టు చూశాడు. పెద్ద గల్లంతు జరిగింది. ఆ దెబ్బతో అనేక కాశ్మీరీ బ్రాహ్మణ కుటుంబాలు మోతీలాల్‌తో చేరి మూడో "పార్టీ" అయాయి. అయితే కాలం గడుస్తున్నకొద్దీ దృక్పథాలలో మార్పు వచ్చింది. పట్టుదలలు సడలాయి, మూడు పార్టీలూ ఒక దానితో ఒకటి చేరి పోయాయి. ఎందరో కాశ్మీరీ యువకులూ, యువతులూ చదువు కోసం అమెరికాకూ, ఇంగ్లండుకూ వెళ్ళి వచ్చారు. వాళ్ళని ప్రాయశ్చిత్తం చేసుకోమని అడిగినవారు కూడా లేరు.

జవాహర్‌కు పదకొండో ఏట ఒక కొత్త ట్యూటరు కుదిరాడు. ఆయన పేరు ఫర్డినండ్ బ్రూక్స్. ఆయన దివ్యజ్ఞాని, లేక థియోసఫిస్టు. ఆయనను మోతీలాల్‌కు అనీబిసెంట్ శిఫార్సు చేసింది. ఆయన జవాహర్ వెంట మూడేళ్ళుండి చదువు చెప్పాడు. అతని పైన ఆయన ప్రభావం ఎంతగానో ఉండేది.




ఆ సమయంలోనే జవాహర్‌కు మరొక ముసలి పంతులు కూడా ఉండేవాడు. ఆయన జవాహర్‌కు హిందీ, సంస్కృత భాషలు నేర్పటానికి నియోగించ బడ్డాడు. అయితే ఆయన ప్రయత్నాలేవీ ఫలించినట్లు కనబడదు, ఎందుకంటే జవాహర్‌కు సంస్కృతం ఏ మంత అంటలేదు.

బ్రూక్స్ వల్ల జవాహర్‌కు పుస్తకాలు చదవటంలో చాలా ఆసక్తి పుట్టింది. అతను

చేతికి దొరికిన ఇంగ్లీషు పుస్తకా లెన్నో చదివాడు. బ్రూక్స్ అతనికి శాస్త్రజ్ఞానంలో కూడా ఆసక్తి కలిగించాడు. వాళ్ళిద్దరూ చేరి ఒక చిన్న ప్రయోగశాల ఏర్పాటు చేశారు. అందులో భౌతిక, రసాయన శాస్త్ర ప్రయోగాలు చేస్తూ జవాహర్ గంటల తరబడి గడిపేవాడు.

జవాహర్ పై బ్రూక్స్ ప్రభావం మరో రూపంలో కూడా పడింది. అయన వారం వారం తన గదుల్లో మీటింగులు జరిపి దివ్యజ్ఞాన చర్చలు సాగించేవాడు. జవాహర్ ఆ మీటింగుల్లో పాల్గొని, దివ్యజ్ఞానుల భావాలూ, పరిభాషా గ్రహించేవాడు. పునర్జన్మ గురించీ, పారలౌకిక ప్రాణులను గురించీ, కర్మసిద్ధాంతం గురించీ చర్చలు జరిగేవి. జవాహర్‌కు ఆ చర్చలు సమగ్రంగా అర్థం కాకపోయినప్పటికీ జగత్తు తాలూకు మూల రహస్యం వారు చర్చించే దానిలో ఉన్నట్టని పించేది. అతను మతం గురించీ, ఇతర లోకాలను గురించీ మొదటి సారిగా ఆలో చించసాగాడు. ఉపనిషత్తులలోనూ, భగవ ద్గీతలోనూ ఉండే హిందూ మత మంటే అతనికి గౌరవం ఏర్పడింది. ఎలాటి సాధ నమూ లేకుండా గాలిలో ఎక్కడికో ఎగిరి పోతున్నట్టు కలలు కనేవాడు.

ఆ రోజుల్లో అనీ బిసెంట్ అలహాబాదు వచ్చి దివ్యజ్ఞానోపన్యాసా లిచ్చింది. ఆ ఉప న్యాసాలు విని, ఆమె వక్తృత్వానికి అచ్చెరు వొంది, జవాహర్ తన పదమూడో ఏట దివ్య జ్ఞాన సమాజంలో చేర నిశ్చయించాడు. అతను తండ్రి అనుమతి కోరాడు. మోతీ లాల్ నవ్వుతూ సరే నన్నాడు, కాని ఏమా త్రమూ లక్ష్యం కనబరచలేదు. అనీ బిసెంట్ స్వయంగా జవాహర్‌కు ఉపదేశ మిచ్చింది. అయితే జవాహర్‌కు ఈ దివ్యజ్ఞానం పైన మోజు ఎంతో కాలం దక్కలేదు. బ్రూక్స్ వెళ్ళిపోయాక అది క్రమంగా క్షీణించింది.

—(ఇంకావుంది)






## 4

[జగతసింహుణ్ణి చూసినది మొదలు దుర్గేశనందిని తిలోత్తమ అతని పై ప్రేమతో కృశించిపోతున్నది. మొదటి సమావేశంలో తిలోత్తమను గురించి విమల జగతసింహుడి కేమీ చెప్పక, పదిహేను రోజుల తరవాత అతన్ని ఆ మందిరంలోనే కలుసుకుని చెబుతానని మాట ఇచ్చింది. గడువు రోజు వచ్చింది. విమల చక్కగా అలంకరించుకుని బయలుదేర బోతూండగా దుర్గేశుడైన వీరేంద్రసింహుడి వద్ద నుంచి ఆమెకు పిలుపు వచ్చింది.]

"ఈ వేషం మార్చుకుని వెళ్ళు," అని తిలోత్తమ విమలకు రహస్యంగా సలహా ఇచ్చింది.

"మరేమీ భయంలేదు," అంటూ విమల తిలోత్తమ గది నుంచి వీరేంద్రసింహుడి గదికి వెళ్ళింది.

అతను పడుకుని ఉన్నాడు. ఒక దాసి అతనికి కాళ్ళు పట్టుతున్నది, మరొకతె విసురుతున్నది. విమల అతని మంచానికి సమీపంగా వెళ్ళి, "చెప్పండి, ఏమిటి సెలవు?" అన్నది.

అతను తల ఎత్తి ఆమె ముస్తాబు చూసి ఆశ్చర్యపడి, "ఎక్కడికో పని మీద బయలు దేరినట్టుందే?" అన్నాడు.

"చిత్తం. నా కేమిటి సెలవు?" అని విమల అడిగింది.

"తిలోత్తమ ఎలా ఉంది?"

"బాగానే ఉంది."



"అస్మానీ వెళ్ళి తిలోత్తమను తీసుకొస్తుంది, అంతదాకా నువు విసురుతూ ఉండు," అన్నాడు వీరేంద్రసింహుడు. అస్మానీ పంఖా కిందపెట్టి బయలుదేరింది.

బయటనే ఉండమని విమల అస్మానీకి సైగ చేసింది. వీరేంద్రసింహుడు రెండో దాసీతో, "నువు తాంబూలం సిద్ధంచెయ్యి," అని ఆమెను కూడా పంపేసి, "విమలా, ఏమిటి ఇవాళ ఇలా ముస్తాబయావు?" అని అడిగాడు.

"దీనితో నాకు పని ఉన్నది."

"ఆ పని ఏమిటో నాకు తెలుసుకోవాలని ఉన్నది."

"అయితే వినండి. నే నివాళ ప్రియ సమాగమం కొరకు పోతున్నాను."

"యమరాజు వద్దకా?"

"మనిషి కాకూడదేం?"

"అలాటి మనిషి ఇంకా పుట్టలేదే!"

"ఒక్కరు తప్ప!" అంటూ విమల చివాలున లేచి వెళ్ళిపోయింది.

ఆమె తన కోసం బయటనే వేచి ఉన్న అస్మానీతో, "నీ కొక రహస్యం చెప్పాలి," అన్నది.

"ఇవాళ నీ ఆర్భాటం చూసి ఏదో ఉన్నదని అప్పుడే అనుకున్నాలే," అన్నది అస్మానీ.

"ఇవాళ నేనొక ముఖ్యమైన పని మీద చాలా దూరం వెళ్ళాలి. ఈ రాత్రివేళ ఒంటరిగా వెళ్ళలేను. తోడు తీసుకు పోదామంటే నువు తప్ప ఎవరూ నమ్మదగిన వాళ్ళు లేరు... అన్నట్టు, వెనక నీకు తెలిసిన వారెవరైనా నిన్నిప్పుడు చూసి గుర్తించగలరంటావా?" అన్నది విమల.

"ఎవరిమాట అడుగుతున్నావు?"

"కుమార జగతసింహుడు నిన్ను చూశాడనుకో."

"అంత అదృష్టమా?"

"ఎందుకు కాగూడదు?"

"యువరాజు నన్ను తప్పక గుర్తిస్తాడు."

"అయితే నా వెంట నువు రావద్దు. ఎలాగబ్బా? ఒంటరిగా పోలేనే!" అంటూ విమల ఆలోచనలో పడింది. ఆస్మానీ నోటికి చెంగు అడ్డం పెట్టుకుని నవ్వసాగింది.

"ఏమిటలా నీలో నువు నవ్వుకుని చస్తున్నావు?" అని విమల అడిగింది.

"బంగారు తండ్రి దిగ్గజు డున్నాడే, అతన్ని నీ వెంట తీసుకుపోతే?"

"మంచి ఆలోచన! మన రసిక రాజును తీసుకు పోతాను," అన్నది విమల.

"ఇంకా నయం! నేను వేళాకోళాని కన్నాను."

"వేళాకోళం కాదు. మూర్ఖులకు ఏమీ తెలీదు. అందుచేత వాళ్ళ వల్ల ఎలాంటి ప్రమాదమూ ఉండదు. కాని బ్రాహ్మడు రానంటా డేమో."

"అదంతా నాకు వదిలిపెట్టెయ్యి. నువు ద్వారం దగ్గిర వేచి ఉన్నావంటే అతన్ని నీ దగ్గిరికి పంపుతాను," అంటూ ఆస్మానీ వెళ్ళింది.

ఆస్మానీ దిగ్గజుడి ఇంటికి వచ్చేసరికి తలుపు గడియవేసి ఉన్నది. "ఓ మహా రాజ్!" అని ఆస్మానీ కేక వేసింది.

ఒకటికి రెండు కేకలు పెట్టినా లోపలి నుంచి జవాబులేదు. ఆమె తలుపు సందుల్లో






నుంచి చూస్తే "రసికరాజు" భోంచేస్తూ ఉండటం కనిపించింది. అందుకే ఆ బ్రాహ్మడు పలకలేదు.

"ఈ బ్రాహ్మడు నాతో మాట్లాడి మళ్ళీ భోజనం చెయ్యడా? చూస్తాను," అనుకుని ఆస్మానీ గట్టిగా పిలిచింది.

దిగ్గజుడు "ఊఁ!" అన్నాడు.

"లోపల ఇంకెవతో ఉన్నదే! భోంచేస్తూ మాట్లాడావుగాదూ, బ్రాహ్మడా? అందరి తోటీ చెబుతానుండు!" అన్నది ఆస్మానీ.

దిగ్గజుడు కంగారుగా చుట్టూ కలయ జూసి, ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని భోజనం చెయ్యసాగాడు.

"అది మాదిగది, అది నాకు తెలుసు. అరె, మాట్లాడి మళ్ళీ తింటున్నావా?" అన్నది ఆస్మానీ.

దిగ్గజుడు కంగారుపడి, "నే నెప్పుడు మాట్లాడానూ?" అన్నాడు.

ఆస్మానీ కిలకిలా నవ్వి, "ఇది మాట్లాడ టంకాదేమిటి?" అన్నది.

"అయ్యో, ఇప్పు డెలా భోంచేసేది?" అన్నాడు దిగ్గజుడు.

"అయితే తలుపు తియ్యి," అన్నది ఆస్మానీ తలుపు సందులో నుంచి అంతా చూస్తూ. దిగ్గజుడు నిజంగానే అన్నం ముందు నుంచి లేస్తూండటం చూసి ఆమె, "లేవకు, లేవకు, భోజనం పూర్తిచెయ్యి," అన్నది.

"మాట్లాడేశాను, మరి భోంచెయ్యను," అన్నాడు దిగ్గజుడు.

"భోజనం చెయ్యకపోతే నామీద ఒట్టే!"

"రామ, రామ! బ్రాహ్మణ్ణయి ఉండి మాట్లాడినాక మళ్ళీ భోజనమా?"

"అలా అయితే నే పోతున్నాను. ఇవాళ ఒక ముఖ్య విషయం చెబుదామనుకున్నాను. అంతా పాడయింది. నే పోతున్నాను."

"వద్దు, వద్దు, ఆస్మానీ. నువలా కోప గించుకోకు. ఇదుగో తింటున్నాను," అంటూ దిగ్గజుడు రెండు, మూడు ముద్దలు నోట

పెట్టుకున్నాడో లేదో, ఆస్మానీ, "చాల్లే, లేని తలుపు తెరు," అన్నది.

"ఇంకో మూడు నాలుగు ముద్ద లున్నాయి. వాటిని కూడా తిననీ."

"తలుపు తీస్తావా మాట్లాడుతూ తిన్నావని అందరికీ చెప్పెయ్యమన్నావా?"

దిగ్గజుడు అన్నం ముందు నుంచి లేచి, చెయ్యీ, మూతీ కడుక్కొని తలుపు తెరి చాడు. ఆస్మానీ లోపలికి రాగానే చేతులెత్తి, "ఆయాహి వరదే దేవీ!" అన్నాడు.

"ఎంత చక్కని కవిత్వం! ఇందుకేగదా నీకు రసికరాజని పేరు పెట్టాను," అన్నది ఆస్మానీ.

"చెప్పు, ఏమిటి విశేషం? ఈ మధ్య నువు బొత్తిగా కనిపించటమే లేదు," అన్నాడు దిగ్గజుడు.

"అరె, కంచం నిండా అన్నం అలాగే ఉండిపోయిందే! భోజనం పూర్తి చెయ్యి, తరవాత మాట్లాడుకుందాం," అన్నది ఆస్మానీ.

"తినటం పూర్తి చేసి లేచానుగద."

"ఉపోషం ఉంటావేమిటి?"

"ఏంచెయ్యను? నువు తొందర చేసి నన్ను లేవగొట్టేశావు." ఇంతలో విమల గబగబా అక్కడికి వచ్చింది.




ఆమె దిగ్గజుణ్ణి భోజనం పూర్తి చెయ్య మన్నది. కడుపు కాలి ఉన్న దిగ్గజుడు సంతోషంగా భోజనం పూర్తి చేశాడు.

"రసికరాజా, ఇవాళ నీతో చాలా ముఖ్య మైన పని ఉన్నది," అన్నది విమల.

"ఏమిటది?" అన్నాడు దిగ్గజుడు.

"మేమిద్దరమూ అంటే నీ కిష్టమే గదా? మే మెందుకు వచ్చామో తెలుసా?" అన్నది విమల.

"మేము నీతో లేచి పోవా లనుకుం టున్నాం," అన్నది ఆస్మానీ.

బ్రాహ్మడు నిశ్చేష్టుడైపోయి, "ఎప్పుడు?" అన్నాడు.



27





"ఇప్పుడే. వెంటనే. నేను ముస్తాబై ఉన్నాను కనిపించటం లేదా?" అన్నది విమల.

ముగ్గురూ కలిసి బయలుదేరారు.

"మనం మళ్ళీ ఎప్పుడు తిరిగి వస్తాం?" అన్నాడు దిగ్గజుడు.

"లేచి పోయేవాళ్ళం తిరిగి ఎలా వస్తాం? ఆ మాత్రం తెలీదా?"

దిగ్గజుడు తన అజ్ఞానానికి సిగ్గుపడ్డాడు.

కొంత దూరం వెళ్ళాక ఆస్మానీ, "మీరు నడుస్తూ ఉండండి. నేను వెనక నుంచి వచ్చి కలుసుకుంటాను," అని వాళ్ళను వదిలేసి తిన్నగా ఇంటికి పోయింది.

మరి కొంత దూరం వెళ్ళాక దిగ్గజుడు విమలను, "ఆస్మానీ ఎక్కడికి పోయిందీ? ఇంకా రాదేం?" అన్నాడు.

"పని ఉండి ఇంటికి పోయింది. రాలేక పోయింది కాబోలు," అన్నది విమల ముందు నడుస్తూ.

ఇద్దరూ మందారణ దాటారు. విమల చాలా చురుకుగా నడుస్తున్నది. అంతకంతకూ అంధకారం జాస్తి అవుతున్నది. ఎక్కడా జనసంచారం లేదు.

విమల దిగ్గజుడితో, "నీకు దయ్యాలంటే భయమేనా? ఈ మార్గాన, ప్రత్యేకించి రాత్రివేళ, దయ్యాల భయం జాస్తి," అన్నది.

దిగ్గజుడు బెదిరిపోయి చప్పున ముందుకు వచ్చి విమల చీరె కొంగు పట్టుకున్నాడు.

"ఆనాడు మేం శైలేశ్వర మందిరానికి వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు మర్రి చెట్టుమీద భయంకరాకారం కనిపించింది," అన్నది విమల. దిగ్గజుడు వణికి పోతూండటం చూసి, ఇంక ఈ ప్రస్తావన ఆపకపోతే బ్రాహ్మడు అడుగు వెయ్యలేని స్థితిలో పడి పోతాడనుకుని ఆమె మాట మార్చి, "రసిక రాజా, నీకు పాటలు వచ్చా? ఏదీ, ఒక మంచి పాట పాడు," అన్నది.



పాట వింటూ ముందు నడుస్తున్న విమల కొంగు గుంజినట్టయి, వెనక్కు తిరిగి, "ఏమయింది?" అన్నది.

దిగ్గజుడు హీనస్వరంతో, "అదుగదుగో!" అంటూ ఒక చచ్చిపోతున్న గుర్రం కేసి చూపాడు. ఆ గుర్రం చక్కగా అలంకరించి, జీను వేసి ఉన్నది.

విమల వ్యాకుల మనస్సుతో వేగంగా ముందుకు సాగింది. వారిద్దరూ సుమారు అరకోసు నడిచిన మీదట వారి కొక సైనికుడి తలపాగా కనబడింది.

ఇంతలో చంద్రోదయ మయింది. విమల అన్యమనస్కురాలై ఉండటం చూసి దిగ్గజుడు, "ఏమీ మాట్లాడవేం?" అన్నాడు.

"దారి వెంబడి గుర్రాల డెక్కల గుర్తులు చూశావా? నీ కేమైనా అర్థమవుతున్నదా?"

"లేదు."

"చచ్చిన గుర్రం, సైనికుడి తలపాగా, గుర్రాల డెక్కల గుర్తులు—ఏమీ బోధ పడలేదా? ఎందుకు నిన్నడగటం?" అన్నది విమల. అంతలోనే ఆమెకు శైలేశ్వరమందిర గోపురం కంటపడింది. ఇక దిగ్గజుణ్ణి తన వెంట ఉండనివ్వ నవసరం లేదనుకుని విమల అతనికి భయంకరమైన భూతాల కథలు చెప్పింది. దిగ్గజు డవి విని, తారెత్తి మందారణ దుర్గం కేసి కాలి సత్తువకొద్దీ పరుగు తీశాడు.

విమల మందిర ద్వారాన్ని సమీపించి, ద్వారం లోపలినుంచి గడియపెట్టి ఉండటం గ్రహించి, తలుపు మీద కొట్టింది.

లోపలి నుంచి గంభీరంగా, "ఎవరు?" అనటం వినిపించింది.

"అలసి ఉన్న ఆడదాన్ని," అన్నది విమల తన ధైర్యాన్ని చిక్కబట్టి.

ద్వారం తెరుచుకున్నది. మందిరంలో దీపం వెలుగుతున్నది. కత్తి చేతబట్టి నిలబడి ఉన్న దీర్ఘశరీరుణ్ణి విమల గుర్తించింది. అతను జగతసింహుడు. —(ఇంకా వుంది)





# నిలకడ మీద నిజం

అంధేరీ దేశపు రాజుకు వరసగా అయిదుగురు కొడుకులు పుట్టారు, కాని ఒక్క కూతురు కూడా కలగలేదు. తనకు ఈ జన్మలో కన్యాదాన ప్రాప్తి ఉండదని రాజుకు బెంగపట్టుకున్నది. మరొక భార్యను చేసుకుంటే ఈ కొరత తీరవచ్చునని రాజుకు కొందరు సలహా ఇచ్చారు.

వారి సలహాను బట్టి రాజు పొరుగురాజు కూతురైన ఊర్మిళ అనే ఆమెను పెళ్ళాడాడు. ఊర్మిళ చాలా అందగత్తె కూడానూ. అయితే ఆమెది దుష్ట స్వభావం. ఆమె తన అందం చేత రాజును వలలో వేసుకుని, రాజు పెద్ద భార్య అయిన చంద్రమతినీ, ఆమె కొడుకు లైదుగురినీ ఇంటి నుంచి వెళ్ళగొట్టించింది.

చంద్రమతి రాజపురోహితుడి సహాయంతో ఒక మారుమూల పల్లెటూరు చేరి, ఎవరికీ తెలియకుండా అక్కడ తన కొడుకులతో జీవించ సాగింది. అప్పటికే ఆమె గర్భవతి అయి ఉన్నది.

మిగిలిన గ్రామస్థులంతా ఏ విధంగా పాటుపడి జీవిస్తారో చంద్రమతీ, ఆమె కొడుకులూ అలాటి పనులే చేసి జీవిస్తూ వచ్చారు. చంద్రమతి కొడుకులు గురువు వద్ద చదువుకుంటూనే, అరణ్యం నుంచి కట్టెలు తెచ్చే వారు, జంతువులను వేటాడి తెచ్చే వారు.

ఆరో కాన్పుకయినా ఆడపిల్ల పుట్టితే, తన భర్తకు తనపై తిరిగి అనుగ్రహం ఏర్పడ వచ్చుననీ, తన జీవితం మారవచ్చుననీ చంద్రమతి కలలు కన్నది. కాని ఈ ఆశ కూడా భంగమయింది; చిన్నరాణి అక్కస్సు తీరలేదనీ, చంద్రమతికి ఆడబిడ్డ పుట్టే పక్షంలో ఆ బిడ్డను చంపించే దురుద్దేశంతో ఆమె వేగులవాళ్ళను నియోగించిందనీ, అందుచేత చంద్రమతికి ఆడపిల్లే కలిగి

బి. ఆంజనేయులు



మగపిల్లవాడు పుట్టాడు. ఈ భార్యకైనా ఆడ పిల్ల పుట్టుతుందని ఎంతో ఆశపడిన రాజుకు ఆశాభంగమయింది.

ఊర్మిళకు పుట్టిన కొడుక్కు జయంతు డని పేరు పెట్టుకున్నారు. వాడు పెరిగి పెద్దవాడయాడు. పదిహేనేళ్ళవాడై ఉండగా జయంతుడు సపరివారంగా వేటకు బయలు దేరాడు. కొంతసేపు అరణ్యంలో తిరిగిన మీదట అతనికి ఆకలీ, దప్పీ కలిగాయి. వాటి బాధకు తట్టుకోలేక జయంతు డొక చెట్టు నుంచి పండు కోసి తిని, అది విష ఫలం కావటం చేత వెంటనే స్పృహ తప్పి పడి పోయాడు.

ఆ సమయంలో అరణ్యానికి కట్టెల కోసం వచ్చిన అతని అన్నలయిదుగురూ అతన్ని చూసి, తమ ఇంటికి చేర్చి, వాంతి చేయించి, తాగటానికి పాలిచ్చి అతన్ని కాపాడారు.

తిరిగి కోలుకున్నాక జయంతుడు తనను కాపాడిన అయిదుగురు అన్నదమ్ములనూ, వారి తల్లినీ, వారి చెల్లెలినీ చూసి ఎంతో ముచ్చటపడ్డాడు. వాళ్ళు చేసిన ఉపకారా నికి కృతజ్ఞత తెలుపుకుని, తా నెవరో వారికి తెలియపరిచాడు.

అతను తన సవతి కొడుకేనని తెలుసు కున్న చంద్రమతికి తన దుస్థితి జ్ఞాపకం

నప్పటికీ, ఆ విషయం దాచిపెట్టి మగబిడ్డ పుట్టినట్టు పది మందికీ చెప్పవలిసిందనీ రాజపురోహితుడు చంద్రమతికి మనిషి ద్వారా కబురు చేశాడు.

ఈ కబురు సమయానికి అందటం మంచిదయింది. ఎందుకంటే చంద్రమతి ఈసారి ఆడపిల్లను కన్నది. కాని, తనకు పుట్టినది మగబిడ్డేనని గ్రామమంతటా ఆమె ప్రచారం చేసింది. ఈ వార్త వేగులవాళ్ళ ద్వారా ఊర్మిళకు చేరింది. ఆమె మనస్సు కుదుటపడింది.

చంద్రమతి ఆడపిల్లను కన్న కొంత కాలానికి ఊర్మిళ కూడా ప్రసవించింది.

వచ్చి కంట తడిబెట్టింది. అది చూసి జయంతుడు వాళ్ళను గురించి ప్రశ్నలు వేశాడు. పదహారేళ్ళ క్రితం తన భర్త తన పిల్లలను ఈ గ్రామంలో వదిలి ఎటో వెళ్ళి పోయాడనీ, తాను అష్టకష్టాలూ పడి పిల్లలను ఎలాగో పెంచుకొచ్చాననీ ఆమె అన్నది. ఆమెకు ఆరవసారి పుట్టిన ఆడపిల్ల వరదా దేవి చాలాకాలం మగపిల్లల బట్టలు ధరించి మగపిల్ల వాడిలాగే తిరిగింది. కాని ఆమె ఎదిగి వస్తూండటం చూసి, తమను లోకమే మరిచిపోయిందని రూఢి చేసుకుని చంద్రమతి తన కూతురికి ఆడ దుస్తులు వెయ్యటం ఆరంభించింది.

జయంతుడు చంద్రమతి పరిస్థితి చూసి జాలిపడి, "అమ్మా, నేను మా వూరు వెళ్ళగానే నీ కొడుకు లందరికీ కొలువు ఏర్పాటు చేయించి పిలిపిస్తాను. మీ రందరూ వచ్చి రాజధాని నగరంలో సుఖంగా ఉండవచ్చు," అన్నాడు.

"వద్దులే, నాయనా. ఇక్కడే మాకు సుఖంగానూ, స్వేచ్ఛగానూ ఉన్నది," అని చంద్రమతి అన్నది.

జయంతు డింటికి తిరిగి వెళ్ళుతూనే తన తల్లితో జరిగినదంతా చెప్పాడు. చంద్రమతినీ, ఆమె కొడుకులనూ, కూతురినీ వర్ణించాడు. ఆ చంద్రమతి రాజుగారి పెద్ద





భార్యేనని ఊర్మిళకు తెలిసిపోయింది. ఆరో సారి ఆడపిల్ల పుట్టితే, మగవాడని అసత్య ప్రచారం చేశారని కూడా ఆమె గ్రహించింది.

అందుచేత ఆమె తన కొడుకుతో, "నాయనా, మీ తండ్రిగారి కొలువులో ఒక రాజద్రోహి ఉండే వాడు. నీవు చెప్పే వాళ్ళు అతని భార్యా, పిల్లలూ అయి ఉంటారు. శిక్షకు భయపడి ఆ ద్రోహి పారిపోయి ఉంటాడు. ఏమైనా వాళ్ళు నీకు ప్రాణ దానం చేశారు గనక వాళ్ళను తగిన రీతిగా ఆదరించటం నా కర్తవ్యం. నేను వాళ్ళ కోసం పిండి వంటలూ, బట్టలూ సిద్ధం చేస్తాను. ఎవరికీ తెలియకుండా నౌకరు చేత వాటిని మోయించుకుని రేపు నువు వాళ్ళింటికి వెళ్ళి, నా తరఫున ఆ బహుమానాలు ఇచ్చేసిరా!" అన్నది.

మర్నాడు జయంతుడు నౌకరు చేత పిండి వంటలు వగైరా మోయించుకుని అరణ్యం సమీపంలో ఉన్న గ్రామానికి బయలుదేరేటప్పుడు ఆమె నౌకరుతో రహస్యంగా, "వీటిని మన యువరాజు తినకుండా చూసే భారం నీదీ. ఇవి సామాన్యుల కోసం చేసిన వంటకాలు!" అన్నది.

జయంతుడు వచ్చి చేరే సమయానికి చంద్రమతీ అమె పిల్లలూ ఇంట్లోనే ఉన్నారు. నౌకరు మోసుకు వచ్చిన వస్తువులన్నీ చంద్రమతి ముందుపెట్టి జయంతుడు, "మా అమ్మ వీటన్నిటినీ మీ కోసం పంపింది," అన్నాడు.

"మా కోసం ఎందు కింత శ్రమపడ్డావు, యువరాజా?" అన్నది చంద్రమతి.

జయంతుడి వెంట వచ్చిన నౌకరు చంద్రమతి కొడుకులతో, "భక్ష్యాలు భోంచెయ్యండి, బాబులూ!" అని తొందర చేయసాగాడు.

చంద్రమతి వాడితో, "మా పిల్లలు ఎప్పుడు పడితే అప్పుడు, ఏది పడితే అది తినరు, నాయనా. సమయం చూసి నేను



వాటిని అందరికీ పెడతానులే," అని వాడు తెచ్చిన వస్తువులను లోపలికి తీసుకు పోయింది. వాడు తెచ్చిన పిండి వంటలలో కొంచెం కొంచెం తీసి కాకులకు వేసింది. ఆమె ఇలా ఎప్పుడూ జాగ్రత్త పడుతూనే వచ్చింది, కాని ఈసారి మాత్రమే కాకులు ఆమె వేసిన భక్ష్యాల తుంపులు తిని గిలగిల కొట్టుకు చచ్చాయి.

కాకుల గొడవ విని జయంతుడు దొడ్లోకి వెళ్ళి, చచ్చిపోతున్న కాకులను చూసి, "ఏమిటిది ?" అన్నాడు.

"ఇది నీకు సుఖం కలిగించే విషయం కాదు, నాయనా. నువు అమాయకుడివి, నిర్దోషివి! కాని ఈ భక్ష్యాలు మేము తినటా నికి యోగ్యమైనవి కావు," అన్నది చంద్ర మతి అతడితో.

ఏ కారణంచేతనో గాని తన తల్లి ఈ కుటుంబానికి విషం కలిపిన భక్ష్యాలు పంపింది. ఆ సంగతి నౌకరుకు కూడా తెలిసి ఉండాలి; అందుకే వాడు వాటిని తినమని చంద్రమతి పిల్లలను తొందర చేశాడు. ఆ నౌకరు చెయ్యి పట్టుకుని జయం తుడు, "ఒరే, ఈ భక్ష్యాలలో విషం ఉన్న దని నీకు తెలుసా?" అని అడిగాడు. నౌకరు తనకు తెలియ దన్నాడు.

"అయితే నేను వీటిని తింటాను," అన్నాడు జయంతుడు.

"రాణిగారు వీటిని మిమ్మల్ని తిననివ్వ వద్దని మరీమరీ చెప్పారు," అన్నాడు నౌకరు లబలబలాడుతూ.

అంటే తన తల్లికి ఈ కుటుంబం పైన ఏదో పగ ఉన్నదన్న మాట. ఆ పగకు కారణమేమై ఉంటుందీ? వీళ్ళు రాజద్రోహి కుటుంబమైనంత మాత్రాన తన తల్లి వీరి చావు కోరదు. ఇందు కింకేదో బలమైన కారణం ఉంటుంది.

తన తండ్రికి మొదటి భార్య ఉండేదనీ, ఆమెను పిల్లలతో సహా తన తండ్రి వెళ్ళ

గొట్టాడనీ జయంతు డెప్పుడో ఒకసారి విన్నాడు. వాళ్ళే వీళ్ళయి ఉంటారా ?

ఇదేదో అంతు తేల్చుకోవా లనుకుని జయంతుడు నౌకరుతో, "నే నింటికి రాను. ఇక్కడే ఉంటాననీ, వీళ్ళతోబాటు నేను కూడా ఈ భక్ష్యాలు తింటాననీ మా అమ్మతో చెప్పు," అన్నాడు. అతను నౌకరు చూస్తుండ గానే ఒక భక్ష్యం తీసుకుని దొడ్డి కేసి వెళ్ళి, అక్కడి నుంచి ఒక చావుకేక పెట్టాడు.

నౌకరు పరిగెత్తుకుంటూ ఊర్మిళ వద్దకు వెళ్ళి, "యువరాజుగారు మీరు పంపిన పిండివంటలు తినేసి కెవ్వున కేకపెట్టేసి పడిపోయారు," అన్నాడు.

ఊర్మిళ గుండెలు బాదుకుంటూ, "పెద్ద రాణీ నా కొడుక్కు విషం పెట్టిందర్రోయ్!" అని ఆక్రోశించింది.

రాజు ఊర్మిళనూ, నౌకరునూ, ఇతర పరివారాన్నీ వెంటబెట్టుకుని చంద్రమతి ఉండే ఇంటికి వచ్చాడు. ఊర్మిళ చంద్రమతిని చూస్తూనే, "నా కొడుకును చంపి పగ తీర్చుకున్నావా, రాక్షసీ?" అన్నది.

జయంతుడు బయటికి వస్తూ, "ఏ పగ తీర్చుకునేటందుకుగాను నువు వీరందరికీ విషంపెట్టి చంప యత్నించావో, అది చెప్పు ముందు!" అన్నాడు.

త్వరలోనే రాజుకు పరిస్థితి అంతా అర్థ మయింది. తన భార్యనూ, కొడుకులనూ ఇంత కాలం అడవుల పాలు చేసినందు కాయన పశ్చాత్తాపపడ్డాడు. లేకలేక తనకు కూతురు పుట్టితే ఆమె తన కళ్ళ ఎదట పెరిగి పెద్దది కావటానిక్కూడా నోచుకో నందు కాయన చాలా నొచ్చుకున్నాడు.

ఆయన చంద్రమతినీ, పిల్లలనూ తన వెంట తీసుకుపోయాడు, ఊర్మిళను చెరలో వేయించాడు, తన పెద్ద కొడుకును యువ రాజు చేశాడు, తన కుమార్తెకు తగిన వరుణ్ణి సంపాదించి కన్యాదానం చేసి, తన చిర కాల వాంఛితాన్ని ఈడేర్చుకున్నాడు.







# కప్పల రాజు

సృష్ట్యాదిలో ఒక పెద్ద సరస్సులో కొన్ని లక్షల కప్ప లుండేవి. అవి చాలా అరాజకంగా బతికేవి. అస్తమానమూ అన్నీ అరుస్తూండేవి. ఒక దాని మాట ఒకటి వినిపించుకునేది కాదు, ఒకటి చెప్పినట్టు మరొకటి చేసేది కాదు.

ఈ పరిస్థితి చూసి ఒక తెలివైన ముసలి కప్ప ఎంతో శ్రమపడి కప్పలన్నిటినీ సమావేశ పరిచి ఇలా చెప్పింది:

"సృష్టిలో ఇన్ని రకాల ప్రాణులున్నాయి గాని మన కప్పలంత నియమ రహితం గానూ, నిరర్థకం గానూ బతుకుతున్న ప్రాణులేవీ లేవు. మనం మాట్లాడేది మనకే తెలీదు; ఎటు పోతామో, ఎందుకు పోతామో కూడా మనం చెప్పలేం. మనకొక క్రమమైన జీవితమూ, జీవిత ధర్మమూ లేదు. దీని కంతకూ కారణమేమంటే మనని అనుశాసించే రాజొకడు లేకపోవటమే. ఒక్క రాజనేవా డున్నట్టయితే మనం అదుపాజ్ఞలలో ఉండి, సక్రమంగా నడుచుకుంటాం. మీ అభిప్రాయ మేమిటి?"

తెలివైన ముసలి కప్ప చెప్పినది కప్పలకు తెలియని విషయం కాదు గనక, రాజుంటేనే తమ జీవితం ఒక గాట్లో పడుతుందని కప్పలన్నీ ఏక గ్రీవంగా ఒప్పుకున్నాయి. అన్ని కప్పల అనుమతీ పొంది ముసలి కప్ప వరుణదేవుడి వద్దకు వెళ్ళి, "దేవా, మా కప్పల కొక రాజును దయచేయించు," అని ప్రార్థించింది.

"దానికేం భాగ్యం. మీ కొక రాజును నేను పంపుతానులే," అని చెప్పి వరుణుడు ముసలి కప్పను పంపేశాడు.

ముసలి కప్ప ఈ శుభవార్తను సరస్సులోని కప్పలకు తెలియజేసింది. అదిమొదలు తమ రాజు ఎప్పుడు వస్తాడా అని కప్పలన్నీ మోరలెత్తి ఆకాశం కేసి చూడసాగాయి.

ఎల్. రమణారావు



వరుణదేవుడు కూడా కప్పల ప్రతినిధికి తాను ఇచ్చిన మాట జ్ఞాపకం ఉంచుకుని, ఒక బ్రహ్మాండ మైన రాతిని కప్ప ఆకారంలో తయారు చేయించి, కప్పలుండే సరస్సులోకి గిరవాటు వేయించాడు.

వెయ్యి పిడుగు లొక్కసారి పడినంత ఆర్భాటంగా ఆ రాయి సరస్సులో పడి, నీటి అడుగున బురదలో గుచ్చుకుపోయింది. ఎంత పెద్ద తుఫానులకూ రానంత పెద్ద తరంగాలు సరస్సులో లేచాయి. నీరంతా కెలకులైపోయి కప్పల కేమీ కనిపించలేదు. అవి దిక్కు తెలియకుండా నీటిలో చెల్లా చెదరుగా పరిగెత్తాయి.

"కప్పల రాజు వచ్చాడు!" అన్న పుకారు కప్ప లన్నిటికీ అందింది. కొన్ని సాహసం గల కప్పలు తమ రాజును చాలా దూరం నుంచి చూసి, "అమ్మ బాబో! మన రాజు ఎంత పెద్దవాడో!" అన్నాయి. రాయి పడిన ప్రాంతంలో ఉండిన కప్పలు ఆ దృశ్యాన్ని పిల్ల కప్పలకు భయంకరంగా వర్ణించి చెప్పాయి.

కప్పల జీవితంలో పెద్ద మార్పు వచ్చే సింది. అవి అస్తమానమూ రొద చెయ్యటం మానేసి, నింపాదిగా మాట్లాడటమూ, రాజు గారు ఏ క్షణాన ఏమని కేకపెడతాడో నని శ్రద్ధగా ఆలకించటమూ, రాజుగారున్న చోటి కేసి పోకుండా, తాము ఎటు పోయేదీ చూసి మరీ పోవటమూ నేర్చుకున్నాయి. కప్పల జీవితంలో చాలా పెద్ద అభివృద్ధి కని పించింది.

కాని ఈ అభివృద్ధి ఎంతో కాలం దక్క లేదు. పిల్ల కప్పలు తమ రాజు గురించి కొన్ని సంగతులు తెలుసుకున్నాయి. వాటిలో కొన్ని సాహసించి తమ రాజును సమీపించి చూశాయి. కప్పరాజు కదలడు. ఎప్పుడూ ఒకే దిక్కు చూస్తాడు. నోరు తెరవడు. తెరవటానికి అసలాయనకు నోరు కూడా ఉన్నట్టు లేదు. అన్నిటికన్న పెద్ద ఘోర

మేమిటంటే కప్పరాజు ఒంటి పైన విప రీతంగా నాచు పెరుగుతున్నది!

పిల్లకప్పలు పెద్ద కప్పల ఎదట తమ రాజును గురించి అవహేళనగా మాట్లాడ నారంభించాయి. "అమ్మో, రాజు! అలా అనకూడదు!" అని పెద్ద కప్పలు భయ పెట్టినకొద్దీ పిల్ల కప్పలకు రాజంటే తృణీ కారభావం హెచ్చిపోయింది. చివరకు పెద్ద కప్పలు తమ రాజును సమీపించి, పిల్ల కప్పలు చెప్పిన మాటల్లో అబద్ధ మేమీ లేదని తెలుసుకున్నాయి. త్వరలోనే కప్పల జీవితం తిరిగి వెనకటిలాగా తయారయింది.

తన ప్రయత్నమంతా విఫలమైనందుకు విచారపడి తెలివిగల ముసలికప్ప మళ్ళీ వరుణదేవుడి వద్దకు వెళ్ళి, తమకు సరి అయిన రాజు ఎంతగా అవసరమో ఆయ నకు చెప్పటానికి దీర్ఘమైన ఉపన్యాసం ఇచ్చింది. వరుణు డంతా విని, "నేను లోగడ పంపిన రాజు మీకు పనికిరాలే దంటావా! మరొక రాజును పంపుతాను, వెళ్ళు," అన్నాడు.

ఆయన ఒక మొసలిని పంపాడు. ఒక నాడు ఆ మొసలి చడీ చప్పుడూ లేకుండా సరస్సులో ప్రవేశించింది. ఒక్క చిన్న అల మాత్రమే నీటిపైన పాకింది. ఈ కొత్త రాజు ఒక చోట ఉండకుండా సరస్సంతటా తిరి గింది. తన ప్రజ లెవరన్నా నోటికి చిక్కితే మరి వదలలేదు.

తమకు సరి అయిన రాజు వచ్చినట్టు కప్పల కర్థ మయింది. పాత అలవాటు చొప్పున అన్ని కప్పలూ ఒకేసారి అరిచి నప్పటికీ సమీపంలో కాస్త సంచలనం కనిపిస్తే చాలు, చిన్న అలికిడి అయితే చాలు, నోళ్ళు మూసేసుకుంటాయి. తమ రాజు వెనుకపాటున ఎక్కడ వచ్చి పడతాడోనని అవి తమ వెనకపక్క చూడటం కూడా అలవాటు చేసుకున్నాయి. కప్పల జీవితాలకు ఒక అదుపూ, ఆజ్ఞా ఏర్పడింది.





# దురాశా ఫలితం

దండకారణ్యపు కొండప్రాంతంలో ఒక ఆటవిక తెగ ఉండేది. ఆ తెగలో ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. ఇద్దరూ వయసు మళ్ళిన వాళ్ళు. ఆ తెగకు చెందిన వాళ్ళు ఏది చేయాలన్నా వీళ్ళ సలహా తీసుకుని మరీ చేసేవాళ్ళు. అందువల్ల వాళ్ళకు లాభించేది.

అన్నదమ్ముల సలహా పొంది నప్పుడల్లా ఆటవికులు వాళ్ళకు చిన్న చిన్న కానుక లిచ్చుకుంటూండే వాళ్ళు.

ఈ కానుకలతో ఆ అన్నదమ్ములకు సుఖ జీవనం జరగటం సాధ్యం కాదు. అయి నప్పటికీ వారి కే కొరతా ఉండేది కాదు. అప్పుడప్పుడూ వాళ్ళిద్దరూ కొండల కేసి వెళ్ళి వస్తూండే వాళ్ళు; ఎక్కడికి వెళ్ళే వాళ్ళో, ఏం చేసేవాళ్ళో ఎవరికీ తెలియదు.

ఆ అన్నదమ్ముల వద్ద తంగడు అని ఒక అనాథ శిశువు, వాళ్ళ తెగకు చెందినవాడే, పెరుగుతూండేవాడు. వాళ్ళు తమకు కావలి సిన చిన్న చిన్న పనులు వాడిచేత చేయించు కుంటూండేవారు. వారి ప్రయాణాల రహస్యం తంగడికి కూడా తెలియదు.

ఇలా ఉండగా అన్నదమ్ములలో చిన్న వాడు కొద్ది రోజులు జ్వరం వచ్చి చని పోయాడు. అది మొదలు పెద్దవాడికి కష్టాలు పట్టుకున్నాయి. గాలి వానకు ఇల్లు కూలి పోయింది. తమ్ముడు బతికుండగా అయితే క్షణంలో ఇంకా పెద్ద ఇల్లు వెలిసేది. కాని అన్న ఆ కూలిపోయిన ఇంటిని బాగుచేసు కోవటానికి శక్తి చాలని వాడులాగా కన బడ్డాడు. గాదెలో గింజలు అడుగంటాయి; అటువంటి పరిస్థితి వెనక ఎన్నడూ లేదు. మూడు పూటలా సుష్టుగా తినే తంగడికి తిండి కూడా సరిగా అమరటంలేదు. వాడు "తాత" ముఖాన తరచు విషాదచ్ఛాయలు చూసేవాడు.

ఆర్. జగన్నాథం

ఉన్నట్టుండి ఒకనాడు "తాత" తంగడితో, "ఒరే, తంగా, ఇదివిను! నీ కొక రహస్యం చెబితే ఎవరితోనూ చెప్పకుండా దాయ గలవా?" అన్నాడు.

"ఎందుకు దాయను, తాతా?" అన్నాడు తంగడు.

"సరే, ఈ రాత్రి కింత అన్నం మూట గట్టు. మనం రేపు ప్రయాణం మీద పోవాలి," అన్నాడు ముసలివాడు.

మర్నాడు ఉదయమే ఇంటికి తాళం పెట్టి, ఆవు పాలు పితికి మేత వెయ్యమని పొరుగింటి వాళ్ళకు చెప్పి, ఇద్దరూ నంది కొండ కని బయలుదేరారు. సంచీలో ఏవో సరుకులు పెట్టుకుని, చేతి కర్ర తాటించు కుంటూ ముసలివాడు ముందు నడుస్తుంటే, తంగడు ఒక చేతిలో జొన్న రొట్టెల మూటా, రెండో చేతిలో చిన్న బరిసె పట్టుకుని వెనక నడిచాడు.

నందికొండ దిగువన ఉన్న అరణ్యం లోకి ఇద్దరూ ప్రవేశించి, చెట్ల మధ్యగా కొండ ఎక్కుతూ సాయంకాల మయేసరికి ఎన్నో మైళ్ళు నడిచి ఒక గుహను చేరు కున్నారు. కొండ మీది నుంచి గుహకు అడ్డంగా లతలు పాకుతూ ఉండటం చేత అక్కడ గుహ ఉన్నట్టు కూడా చప్పున



తెలియటం లేదు. ఆ రాత్రికి వాళ్ళిద్దరూ గుహ ద్వారం వద్ద ఆహారం తిని, పడుకుని నిద్రపోయారు.

మర్నాడు తెల్లవారుతూనే ముసలివాడు తంగణ్ణి తన వెనకనే రమ్మని గుహలోకి దారి తీశాడు. వాళ్ళు లోపలికి వెళ్ళటానికి సన్నని రంధ్రం కుండా దేకుతూ వెళ్ళవలిసి వచ్చింది. కాని లోపలికి వెళ్ళాక గుహ ఎత్తు గానూ విశాలంగానూ ఉంది. అయితే లోపల కన్ను పొడుచుకున్నా కనపడని చీకటి. ముసలివా డొక మైనం వత్తి తీసి వెలిగించి, దాని వెలుగులో ముందు నడిచాడు. తంగడు తాత వెనకగా నడిచాడు.

గుహలోకి చాలా దూరం వెళ్ళాక ముసలి వాడు మైనం వత్తిని ఒక రాయి మీద నిల బెట్టి, "ఒరే, తంగా, నే నిప్పు డొక గొప్ప గారడీ చెయ్యబోతున్నాను. నువు నాకు సహాయం చెయ్యాలి. ఆదివరకు నా తమ్ము డీ సహాయం చేసేవాడు. నువు వాడి పనే చెయ్యాలి," అన్నాడు.

తంగడికి గుండె గుబగుబ లాడింది. కాని, చేస్తా నన్నట్టు తల ఆడించాడు.

ముసలివాడు సంచీ తెరిచి, అందులో నుంచి ఒక ఇనప బొచ్చె, చిన్న సొరకాయ బుర్రా, ఆకు పచ్చని నూనె గల ఒక సీసా, అతి విచిత్రంగా ఉన్న పొడుగుపాటి చెట్టు వేరూ పైకి తీశాడు. వాటిని చూసి తంగడు దడుచుకున్నాడు. ఆ వేరు వాడికి మరీ భయంకరంగా కనబడింది. అది ఏ చెట్టు వేరో వాడూహించలేక పోయాడు.

ముసలివాడు ఇనప బొచ్చెలోకి సొర బుర్రలో నుంచి నల్లని పొడి కొంత పోశాడు. తరవాత వేరు నుంచి కత్తితో సన్నని చక్రా లనేకం తరిగాడు. ఒక చక్రం తీసి మైనం వొత్తి జ్వాలలో అంటించాడు; సురసురా మండే ఆ చక్రాన్ని బొచ్చెలోని నల్లని పొడిలో వేశాడు. వెంటనే బొచ్చెలో నుంచి ఆకుపచ్చగానూ, నీలం రంగుగానూ జ్వాలలు లేచాయి.



"ఒకటి!" అన్నాడు ముసలివాడు.

బొచ్చెలోని జ్వాలలు తగ్గిపోయే సమయానికి, "రెండూ!" అంటూ ముసలివాడు ఇంకొక చక్రాన్ని బొచ్చెలో వేశాడు. జ్వాలలు మళ్ళీ లేచాయి. ఈ విధంగా నాలుగైదు చక్రాలు మంటలలో ఒకటి కాలినాక మరొకటిగా వేల్చి, "ఈ పని చెయ్యగలవా?" అని తంగణ్ణి అడిగాడు.

"చెయ్యగలను, తాతా," అన్నాడు తంగడు ధైర్యంగా.

ముసలివాడు వేరు నుంచి మరి పది చక్రాలు తరిగి, "ఇది ఒక్కొక్కటే మంటల్లో వెయ్యాలి. ఒకటి కాలటం పూర్తి కావస్తూండగా మరొకటి వెయ్యాలి. చక్రాలు వేల్చేటప్పుడు ఒకటీ, రెండూ, మూడూ, అని పది దాకా గట్టిగా పైకి అనాలి. ఈ లోపల నీ కేం కనబడినా, నే నేం చేసినా గమనించకు. నీ పని నువు చేసుకుంటూ పోవలిసిందే. తెలిసింది కాదూ?" అన్నాడు.

తంగడు తల ఆడించాడు. ముసలివాడు, "నేను ముసుగు కప్పుకునే దాకా ఆగి ఆ తరవాత ప్రారంభించు," అని చెప్పి, చేతి కర్ర ఒక పక్కగా పెట్టి సీసాలో ఉన్న నూనె కొంచెం తాగి, కంబళి నెత్తినిండా కప్పుకుని ఏవో మంత్రాలు గొణగసాగాడు.



కొంచెం సేపటికి తంగడు తల ఎత్తి చూస్తే తాత లేడు. తాత బట్టలూ, గొంగళీ నేలపైన కుప్పగా పడి ఉన్నాయి. వాటి కింది నుంచి ఒక ఆకు పచ్చని పాము బయటికి వచ్చింది. తంగడు కెవ్వున అరిచి చాలా దూరం పారిపోయాడు.

"తంగా! ఇలారా!" అని తాత కేక వినిపించింది.

తంగడు భయపడుతూ యథాస్థానానికి వచ్చాడు. ముసలివాడు పట్టరాని ఆగ్రహంతో నానా తిట్లూ తిట్టి, "నేనేం చెప్పాను? ఏం చూసినా పట్టించుకోవద్దనీ, నీ పని చేసుకుపొమ్మనీ చెప్పానా?" అన్నాడు.



4




"నిజమే. కాని ముందుగానే ఇలా అవుతుందని నాకు మాట మాత్రం చెప్పి ఉండవలిసింది, తాతా. సరే, ఈసారి చూసుకో," అన్నాడు తంగడు.

వాడన్న మాట నిలబెట్టుకున్నాడు; పది చక్రాలు తీసుకుని ఒక్కొక్కటే మంటలో వేల్చుతూ, ఒక కంట తాత చేసేదంతా కనిబెడుతూనే ఉన్నాడు. ముసలివాడు ఏవో మంత్రాలు చదివి పాముగా మారిపోయి, ఆ గుహలోనే ఒక చోట ఉన్న నెర్రె దగ్గిరికి పాకిపోయి, అందులో దూరి ఒక బంగారు నాణెం నోట కరుచుకుని వచ్చి, దాన్ని ఒక చోట పడవేసి, మరొకటి తీసుకు రావటానికి వెళ్ళాడు. ఈవిధంగా పది చక్రాలూ మండే దాకా ఆ పాము నాణాలు తెచ్చి, మంటలు ఆరిపోయి చీకటి కాగానే తిరిగి ముసలాడుగా మారింది.

ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు తంగడు ముసలివాణ్ణి, "తాతా, ఇదివరకల్లా డబ్బు ఇలాగే వచ్చిందా?" అన్నాడు.

"ఔనురా!" అన్నాడు ముసలివాడు.

తంగడు, "ఏమిటి?" "ఎలాగా?" అని చాలా ప్రశ్నలు వెయ్యటానికి యత్నించాడు. కాని ముసలివాడు, "నీకు సంబంధించని ప్రశ్న లేవీ వెయ్యకు. ఒక్క సంగతి జ్ఞాపకం ఉంచుకో. ఈ సంగతి మూడో వాడికి తెలిసిందో మనం బతకలేం. డబ్బు కోసం అందరూ ఎగబడతారు. మంత్రాలు తెలిసినవాళ్ళున్నారని తెలిస్తే మహారాజులు బతకనివ్వరు. అందుకని—జాగ్రత్త!" అని హెచ్చరించాడు.

అది మొదలు ముసలివాడికి దారిద్ర్య బాధ పోయింది. మళ్ళీ పెద్ద ఇల్లు ఏర్పడింది. సుష్టుగా తిండి అమరింది. పాత రోజులు తిరిగి వచ్చినట్టయింది.

రెండేళ్ళపాటు తాతకు తంగడు సహాయపడ్డాడు. ఆ తరవాత వాడికి పెళ్ళి అయింది. వాడి పెళ్ళాం శోభ. అది జీడిలాటి మనిషి-



పట్టుకుంటే వదిలేదికాదు. త్వరలోనే అది బంగారం సంగతి పసికట్టి, తంగడి ప్రాణాలు తోడి వాడి చేత రహస్యం బయట పెట్టే యించేసింది.

"ఇది పరమ రహస్యం ఎవరికీ చెప్ప కూడదు," అన్నాడు తంగడు తన భార్యతో.

"నే నెందుకు చెబుతానూ ?... అయితే ఈ ముసలా డిలా ఎంత బంగారమన్నా తేగలడంటావా ?" అన్నది శోభ.

"తేగలడనే అనుకోవాలి," అన్నాడు తంగడు.

"అయితే కాస్తా కాస్తా తెస్తాడేం ? నాకు బోలెడంత ఖర్చున్నది. నాకు కొత్త బట్టలు కావాలి. ఇంట్లోకి బోలెడంత సామాను కొనాలి. ఏమిటీ ముసలాడి ఉద్దేశం ?" అన్నది శోభ.

ఆమె కొక ఆలోచన తట్టింది. తన సహాయంతో తంగడు పాముగా మారి బంగారం తెస్తే పని జరిగిపోతుంది. ఆమె ఈ సూచన చేసినప్పుడు తంగడు, "నూనె తాగటమైతే తేలికే గాని, గొంగళి కింద దూరి ఏదో మంత్రం గొణుగుతాడు. ఆ మంత్రం రానిదే పని జరగదేమో," అన్నాడు.

శోభ అంత తేలికగా విడిచిపెట్టే రకం కాదు. ముసలివాడు ఇంటో లేని సమ



యంలో అతని సంచీ తీసింది. భార్యా భర్త లిద్దరూ నూనె తాగి, వేరు చక్రాలు తగల బెట్టి చూశారు. ఫలితం లేక పోయింది.

"ఈసారి గుహకు వెళ్ళినప్పుడు ముసలాడు చదివే మంత్రాలు బాగా విని కంఠస్థం చెయ్యి," అన్నది శోభ తంగడితో. ఒకటికి రెండు సార్లు వింటేగాని ముసలివాడు చదివే మంత్రం తంగడికి పట్టుబడలేదు.

ముసలివా డింటో లేని సమయం చూసి భార్యా భర్త లిద్దరూ మంత్రాన్ని ప్రయోగించి చూశారు. ఈ సారి మంత్రం పారింది. తంగడు పాముగా మారిపోయాడు. కాని ఆ క్షణంలోనే ముసలివాడు ఇంటికి తిరిగి

వచ్చాడు. పామై పోయిన తంగడికి మనిషి రూపం ఇచ్చాడు.

"చూడు, ముసలాడా? నీ రహస్యం మాకు తెలుసు. ఇంక వెనకటిలాగా సాగదు. ఇక నుంచి బంగారం కాస్త కాస్త తెచ్చి లాభం లేదు. తెచ్చినదాన్లో హెచ్చు భాగం మా కిచ్చెయ్యాలి. ముసలాడివి నీకు డబ్బుతో అవసరం లేకపోవచ్చు గాక, పడుచువాళ్ళం, మా కది చాలా అవసరం," అన్నది శోభ.

మర్నాడు ముగ్గురూ కలిసి గుహకు వెళ్ళారు. ముసలివాడు పది చక్రాలే వేరు నుంచి తరిగాడు. ఇంకా హెచ్చుగా తరగ మన్నది శోభ. ఆ మంత్రం పది చక్రాలు మండే వరకే పని చేస్తుం దన్నాడు ముసలి వాడు. "అలా అయితే మమ్మల్నిద్దరినీ పాము లుగా చేసి పంపించు. పాముగా మారే మంత్రం నాకూ తెలుసు," అన్నది శోభ. ముసలివాడు సరే నన్నాడు.

ముసలివాడు చక్రాలు ఒకటొకటిగా వేల్చుతుంటే భార్యా భర్త లిద్దరూ పాము లుగా మారి, కన్నంలో నుంచి బంగారు నాణాలు తెచ్చి ఒక కుప్పగా పోశారు. పదో చక్రం కూడా మండి ఆరిపోయే సరికి పెద్ద కుప్పే తయారయింది. కాని పాములు తిరిగి మనుషులు కాలేదు.

ముసలివాడా పాములను చూసి, "మీకు మనుషులుగా మారే మంత్రం తెలీదు. అయినా తొందరపడ్డారు. ఈ మంత్రం మీబోటి వాళ్ళకు తెలియరాదు. నేనిక బంగారం సంపాదించలేను, నిజమే కాని ఈ బంగారం నాకు జీవితాంతం దాకా సరి పోతుంది. మీరీ అరణ్యంలో పాములుగా సంచరించి జీవితం వెళ్ళబుచ్చండి," అంటూ దారి పట్టాడు.

రెండు పాములూ ఒకదాన్నొకటి చూసు కుని, గుహనుంచి బయటికి వచ్చి అరణ్యం లోకి వెళ్ళిపోయాయి.





# చచ్చిపోయిన పెళ్ళికొడుకు

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ వింతగా ఈ అర్థ రాత్రివేళ శ్రమపడుతున్నప్పటికీ నీకు దక్కవలసిన ఫలితాన్ని నీ కన్న హీనుడు పొందవచ్చు నని నీకు తోచిందా? అందుకు నిదర్శనంగా నీకు కుమారవర్మ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కుమారవర్మ అవంతీ నగరానికి చెందిన యువకుడు. వారిది కావటానికి ఘనమైన వంశమే గాని, కుమారవర్మ తాత ముత్తాతలు వైభవంగా బతకటం కోసమనీ, దాత లనిపించుకుందామనీ ఉన్న ఐశ్వర్యమంతా తగలేశారు. అందుచేత కుమారవర్మ తండ్రి తన కొడుక్కు సంపన్నుల ఇంటి పిల్లను చేసుకుందామని నిశ్చయించి, కోటీశ్వరుల

బేతాళ కథలు



పిల్లను, మహా వికారమైనదాన్ని కోడలుగా చేసుకోవటానికి సిద్ధపడ్డాడు.

కాని కుమారవర్మ ధనలోభి కాడు. అతని ఆశయం జీవితంలో అసాధారణమైన అనుభవాలు పొందటం; మనిషిలాగా బతకటం. అందుచేత అతను డబ్బు కోసం కురూపి అయిన భార్యను చేసుకోనన్నాడు. తండ్రి కొడుకుల మధ్య ఘర్షణ జరిగింది. చివరకు కుమారవర్మను తండ్రి ఇంటి నుంచి వెళ్ళగొట్టాడు. కుమారవర్మ విచారించలేదు. ప్రపంచం విశాలమైనది. ధైర్య సాహసాలు గల వాడికి ప్రపంచంలో ఎన్నో అపూర్వమైన అనుభూతులు కలుగుతాయి. వాటి కోసమై అతను ఇల్లు విడిచి దేశాల మీద బయలు దేరాడు.

కుమారవర్మ ఉజ్జయినీ నగరంలో కొంత కాలం ఉండి, అక్కడి నుంచి అమరావతీ పట్టణానికి బయలుదేరాడు.

అదే రోజున ఉజ్జయినీ నగరపు వర్తకుడి కొడుకు ధనగుప్తుడనే వాడు కూడా అమరావతీ పట్టణానికి బయలుదేరాడు. ఉజ్జయినీ నగరం దాటగానే ఇద్దరూ తారసిల్లారు. ఇద్దరూ గుర్రాలెక్కి ప్రయాణం చేస్తున్నారు. ధనగుప్తుడు తండ్రిలాగే అస్తమానమూ వ్యాపారంలో మునిగి తేలేవాడు. తన వృత్తీ, తన నగరమూ తప్ప మిగతా ప్రపంచం గురించి తెలిసినవాడు కాదు. కొత్త వారితో పరిచయం చేసుకునే చొరవ అతనికి బొత్తిగా లేదు. అయితే కుమారవర్మకు అందులో ఎంతో నేర్పుండటంచేత త్వరలోనే ఇద్దరికీ స్నేహం కలిసింది. కుమారవర్మ ధనగుప్తుడు బయలుదేరిన పనిని గురించి వివరాలన్నీ క్రమంగా తెలుసుకున్నాడు.

ఒక విధంగా ధనగుప్తుడు కుమారవర్మకు విరుద్ధమైన వ్యక్తి. అతని తండ్రి కూడా ధనాశ చేత అమరావతీ పట్టణంలోని ఒక కోటీశ్వరుడి కుమార్తెను తన కొడుక్కు

మాట్లాడాడు. ఉభయపక్షాలవారూ ఉత్తరాల ద్వారా వివరాలన్నీ నిర్ణయించుకున్నారు. పెళ్ళికూతురు తన తండ్రి ఇంటి నుంచి ఇన్ని లక్షలు తీసుకు రావాలని ఖరారయింది. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ ఒకరి నొకరు చూసుకున్నాక లాంఛనంగా ప్రధానం జరిగి, ముహూర్తం నిర్ణయం కావలిసి ఉన్నది. అందుచేత ధనగుప్తుడు తన కాబోయే అత్త వారి ఊరుకు బయలుదేరాడు.

ఈ విషయాలు విని కుమారవర్మ ఆశ్చర్యంతో, "పిల్ల మంచి భరణం తెస్తున్నది బాగానే ఉంది. కాని ఆమె అందంగా లేకపోతే ఎలా పెళ్ళాడతావు? బతికున్నన్నాళ్ళూ ఆమెతో ఎలా కాపరం చేస్తావు?" అని ధనగుప్తుణ్ణి అడిగాడు.

"పిల్ల బాగానే ఉంటుందన్నారు. కాస్త కుడీ ఎడమైతేనేం? అన్నీ ఒనగూడుతాయా? కొంతవరకు సరిపెట్టుకు పోవాలి," అన్నాడు ధనగుప్తుడు.

కుమారవర్మ వెంట ఉండటం ధనగుప్తుడి కెంతో మేలయింది. కొత్త చోట కూడా స్వతంత్రంగా అడిగి పనులు చేయించు కోవటమూ, వీలయినన్ని సౌకర్యాలు సాధించటమూ కుమారవర్మకు బాగా తెలుసు. ఆ విద్య ధనగుప్తుడికి తెలియదు. ధనగుప్తుణ్ణి కొంచెంకూడా లక్ష్యపెట్టనివారు





కుమారవర్మ పట్ల ఎంతో విధేయత కన బరిచారు. కుమారవర్మకు మంచి మజిలీలు కూడా తెలుసు.

వారిద్దరూ కొన్ని రోజుల అనంతరం అమరావతీ పట్టణం చేరుకున్నారు. అలాటి మహా నగరాన్ని ధనగుప్త డెన్నడూ ఊహిం చను కూడా లేదు. కాని కుమారవర్మకు ఆ నగరం ప్రతి మూలా తెలుసు.

"చీకటి పడబోతున్నది. ఇప్పుడు నీవు మీ అత్తవారిల్లు వెతుక్కుంటూ పోలేవు. ఈ రాత్రికి మంచి సత్రంలో బస చేసి, సుఖంగా విశ్రాంతి తీసుకుని, రేపు ఉదయం వెళుదువుగాని," అని కుమారవర్మ సలహా ఇచ్చాడు. నగరాన్ని చూసి బెదిరిపోయిన ధనప్తుడి కీ సలహా బాగా నచ్చింది. అతను కుమారవర్మ వెంట ఒక పెద్ద సత్రానికి వెళ్ళాడు. అది సత్రం లాగా లేదు, రాజ భవనం లాగా ఉన్నది.

కుమారవర్మ సత్రం యజమానితో, "మా కిద్దరికీ చెరొక గదీ కావాలి. ప్రయా ణంలో చచ్చు తిండి తిన్నాం, మృష్టాన్న భోజనం తయారు చేయించండి. డబ్బుకు చూడవద్దు," అన్నాడు.

ఆ రాత్రి ధనగుప్తుడు చేసిన భోజనం నిజంగానే దివ్యంగా ఉన్నది. అంత రుచి కరమైన వంట అతనెన్నడూ ఎరగడు. అసలే తిండిపోతు కావటంలో మితిమీరి తిన్నాడు. దాని ఫలితంగా ఒక రాత్రివేళ అతని కడుపులో శూల కలిగింది. చాలాసేపు బాధపడి, అంత కంతకూ బాధ ఎక్కువవు తూండటం చేత కేకలు పెట్టాడు. సత్రం యజమాని వచ్చి చూసి, వైద్యుడికి కబురు చేశాడు. వైద్యుడు వచ్చి ధనగుప్తుణ్ణి పరీ క్షించి, అతని కడుపులో గుల్మం ఉన్నదనీ, తిన్న తిండి వికటించటం చేత ప్రమాదస్థితి ఏర్పడిందనీ, అతని బంధువు లెవరన్నా ఉంటే పిలిపించటం మంచిదనీ, సత్రం యజమానికి చెప్పాడు.

అతను దూరదేశం నుంచి వచ్చిన వాడు కావటం చేత దగ్గిరలో బంధువు లుండరను కుని, సత్రం యజమాని కుమారవర్మను లేపుకొచ్చాడు. ధనగుప్తుడి స్థితి చూసి కుమారవర్మ చాలా జాలిపడ్డాడు.

"నేను తెల్లవారేలోగా తేరుకోక పోతే నా సంగతి మాధవగుప్తుడికి తెలియ జెయ్యాలి. నేను వస్తున్నట్టు వారికి ముందు గానే కబురు చేశాం. నా కోసం ఎదురు చూస్తూ ఉంటారు. వారే మా ఇంటికి కూడా వార్త తెలపగలరు," అన్నాడు ధనగుప్తుడు.

అలాగే చేస్తానని కుమారవర్మ మాట ఇచ్చాడు. ధనగుప్తుడు తెల్లవారక ముందే ప్రాణాలు వదిలాడు. మధ్యాహ్నం వేళకు అతనికి దహనం వగైరా జరిగే ఏర్పాటు చేసి, తెల్లవారుతూనే కుమారవర్మ నగరంలో మాధవగుప్తుడి ఇల్లు వెతుక్కుంటూ బయలు దేరాడు.

మాధవగుప్తుడి కుటుంబంవాళ్ళు కుమార వర్మను చూస్తూనే ధనగుప్తుడని పొరపాటు పడ్డారు. తాను ధనగుప్తుడు కాడనీ, అతని మరణ వార్త చెప్ప వచ్చిన వాణ్ణనీ అన టానికి అతనికి వాళ్ళు అవకాశం ఇవ్వలేదు.

"నిన్న ఉదయం నుంచీ నీ రాక కోసం ఎదురు చూస్తున్నాం!" అన్నాడు మాధవ గుప్తుడు చిరునవ్వునవ్వుతూ.





కుమారవర్మ వారందరి ఉత్సాహాన్నీ చూసి, వారికి నిజం చెప్పరాదని నిశ్చయించుకున్నాడు. అతనికి సరదాగా ఉండే అపూర్వమైన అనుభవం ఒకటి తలవని తలంపుగా లభ్యమయింది. అందుచేత అతను తాను ధనగుప్తుడయినట్టుగా నటిస్తూ, "నిన్న నేను వచ్చి చేరేసరికి చీకటిపడింది. అందుచేత సత్రంలో బస చేశాను," అన్నాడు మాధవగుప్తుడితో.

కాబోయే అల్లుడు తాము విన్నదానికన్నా, అనుకున్నదానికన్నా కూడా అందంగానూ, కలుపుగోలుగానూ ఉన్నాడని మాధవగుప్తుడి తాలూకు బంధువులంతా అనుకున్నారు.

వారిలో ఒక యువకుడి ముఖం మటుకు కోపంగా, రౌద్రంగా ఉండటం కుమారవర్మ గమనించాడు.

ఆ యువకుడు వజ్రపాలుడు. అతను మాధవగుప్తుడి దూరపు బంధువు. పేదవాడు. అమరావతీ నగరపు రాజు వద్ద సైనికుడుగా ఉండి పొట్టపోసుకుంటున్నాడు. అతను పేదవాడు కానట్టయితే మాధవగుప్తుడు తన కుమార్తె కళ్యాణిని అతనికిచ్చి చేసి ఉండవలసిందే. కాని తన కూతురిని శ్రీమంతుల ఇంట ఇవ్వాలన్న కోరికతో ఆయన అల్లుడి కోసం చాలా దూరం వెళ్ళాడు.

వజ్రపాలుడు కుమారవర్మను పక్కకు తీసుకుపోయి, "నువు కత్తి కూడా పెట్టుకున్నావే? ఉపయోగించగలవా?" అన్నాడు.

"నీకు చూడాలని ఉంటే చూడవచ్చు. కాని ఎప్పుడు? ఎక్కడ?" అన్నాడు కుమారవర్మ.

"ఆ తోటలో. భోజనాలయాక," అన్నాడు వజ్రపాలుడు.

"ఇంతకూ నాపై నీకేమిటి కక్ష?" అని కుమారవర్మ అడిగాడు.

"నా సంగతి తెలిసి ఉంటే కళ్యాణిని పెళ్ళాడే ఉద్దేశంతో నీవు మీ ఊరు విడిచి

పెట్టి, ఇంతదూరం వచ్చి ఉండవు!" అన్నాడు వజ్రపాలుడు.

ఆ సమయంలో మాధవగుప్త డక్కడికి వచ్చి, "నాయనా, ఇంకొక గడియలో భోజనాలు చేస్తాం. ఈలోపుగా అమ్మాయీ, నీవూ ఏదైనా మాట్లాడుకోవాలంటే మాట్లాడుకోవటం మంచిది గదా! మధ్యాన్నం దాటగానే పురోహితుడు వస్తాడు. ప్రధానం జరుగుతుంది," అన్నాడు.

తరవాత కాస్సేపటికి కుమారవర్మ ఉన్న చోటికి కళ్యాణి ఒంటరిగా వచ్చింది. కాబోయే భర్త దగ్గిర చూపవలిసిన లజ్జా, బిడియమూ ఆమెలో ఏమీ కనిపించలేదు.

"నీ వింత అందంగా ఉంటావని నాకు తెలీదు," అన్నాడతను ఆమెతో.

"మీకు నా అందంతో ఏం పని? నేను తేవలిసిన కట్నాలూ, కానుకలూ రాసుకుని ముందుగానే ఖరారు చేసుకున్నారు గదా!" అన్నది కళ్యాణి.

"అంటే మనిద్దరి మధ్యా ప్రేమకు అవకాశమే ఉండదంటావా?" అన్నా డతను.

"ఏ మాత్రమూ ఉండదు," అన్నది కళ్యాణి కఠినంగా

తరవాత భోజనాలయాయి. కుమారవర్మ ఎటో బయలుదేర బోతూండటం చూసి, "ఎటూ వెళ్ళకు. ఇంకో రెండు గడియల్లో





పురోహితుడు వచ్చేస్తాడు," అన్నాడు మాధవగుప్తుడు.

"అలా తోటలోకి వెళ్ళొస్తాను," అంటూ కుమారవర్మ బయలుదేరాడు. తోట వాకిలి తెరుచుకుని అటు నుంచి అటే వెళ్ళి పోదామని అతని ఉద్దేశం. కాని వజ్రపాలుడు అతని వెనకాలే తోటలోకి ప్రవేశించాడు.

కుమారవర్మ వెనక్కు తిరగగానే వజ్రపాలుడు వెటకారంగా, "ప్రాణాలు దక్కించుకుని పారిపోదామనుకున్నావు కాదూ?" అని ప్రశ్నించాడు.

"ఆ సంగతి తెలిసేనా తలుపులకు తాళం పెట్టావు?" అని కుమారవర్మ అడిగాడు.

"అవును, నువు పిరికి పందవని నాకు తెలుసు!" అన్నాడు వజ్రపాలుడు.

"ఆ ధైర్యంతోనా నన్ను కత్తి యుద్ధానికి పిలిచావు? ఎంత నీచుడివి! ఎలాటి పిరికి పందవు! నిన్ను విడవరాదు!" అన్నాడు కుమారవర్మ.

వజ్రపాలుడు రంకె పెట్టి, కత్తి దూసి కుమారవర్మ పై కలియబడ్డాడు. ఇద్దరూ కొద్ది క్షణాలు పోరాడాక, "నీ వింత చచ్చు వీరుడి వనుకోలేదు. ఇదుగో పట్టు!" అంటూ కుమారవర్మ వజ్రపాలుడి చేతి కత్తిని ఎగరగొట్టి తన చేతికి తీసుకున్నాడు.

"నా కత్తి నా కిచ్చెయ్యి," అన్నాడు వజ్రపాలుడు.

"నీ కత్తి నీ కివ్వటమంటే మళ్ళీ యుద్ధం సాగించటమన్న మాటే. అది నీకు అపాయకరం. ఇక ముందైనా నీవు నిజమైన పిరికి వాళ్ళతోనే యుద్ధం చెయ్యటం మంచిది," అంటూ కుమారవర్మ వెనక్కు తిరిగే సరికి కళ్యాణి అక్కడికి వచ్చి, "ఏమయింది? ఏమయింది?" అని ఆత్రంగా అడిగింది.

ఏమి జరుగుతున్నదీ ఆమెకు తెలుసును! తాను ఆమె ప్రియుడి చేతిలో చచ్చిపోతాడని అనుకున్నది! ఈ సంగతి గ్రహించిన



కుమారవర్మ వజ్రపాలుడి కత్తిని ఆమె చేతి కిస్తూ, "అతన్ని కాస్త జాగ్రత్తగా కనిపెట్టి ఉండు. లేకపోతే ఈ కత్తి ఇతరుల ప్రాణం తీయటం కన్న అతని ప్రాణానికే అపాయం కలిగించే అవకాశం జాస్తి," అని చెప్పి ఇంటి కేసి వెళ్ళాడు.

అతను మాధవగుప్తుణ్ణి చూసి, "నేను వచ్చిన పని అయిపోయింది. ఇంక నాకు సెలవిప్పించండి," అన్నాడు.

మాధవగుప్త డాశ్చర్యంతో, "అదేమిటి? ఇంకొక గడియలో పురోహితుడు ఇంటికి వచ్చి ప్రధానం చేయించి ముహూర్తం పెడతాడు," అన్నాడు.

"అవుననుకోండి. నాకు అంత కన్న తొందర పని ఉన్నది. ఇంకొక గడియలో నన్ను దహనం చేసేస్తారు," అన్నాడు కుమారవర్మ.

మాధవగుప్తుడి కిదేం హాస్యమో అర్థం కాలేదు. "అలా అవాచ్యాలు పలుకుతా వేమోయ్?" అన్నాడాయన.

"అవాచ్యాలు కావండి. నేను చెప్పేది యథార్థం. అసలే నేను తిండిపోతును. రాత్రి సత్రంలో మంచి భోజనం పెట్టారు. మితిమీరి తినేశాను. నా కడుపులో గుల్మం చేరి ప్రాణం తీసేసింది. తెల్లవారుజామున నేను చచ్చిపోయాను. ఇంక కొంచెంసేపట్లో నాకు దహన క్రియలు జరుగుతాయి. నేను లేకుండా ఎలా?" అన్నాడు కుమారవర్మ.

అందరూ నిర్ఘాంతపోయి నోర్లు తెరుచుకు చూస్తుండగా కుమారవర్మ వెళ్ళిపోయాడు.

తరవాత మాధవగుప్తుడు నౌకరును పంపి విచారిస్తే, కిందటి రాత్రి సత్రంలో బస చేసిన ధనగుప్తుడు మరణించాడనీ, మధ్యాన్నంవేళ అతనికి దహన క్రియలు జరిగాయనీ తెలిసింది.

తాము చూసినది ఆ ధనగుప్తుడి దయ్యాన్ని కాబోలు నని మాధవగుప్తుడి కుటుంబంవా రనుకున్నారు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా నా కొక సందేహం. కళ్యాణికి ధనగుప్తుడంటే ఇష్టం లేని మాట నిజమే. దానికి కారణం అతను తనను డబ్బు కోసం పెళ్ళాడుతున్నా డనేది. ఆ సంగతి కుమారవర్మకు తెలుసును. ఆమె తనను ప్రేమించే పక్షంలో అతను పెళ్ళాడి ఉండే వాడని కూడా స్పష్ట మవుతున్నది. అలాటి పరిస్థితిలో తా నెవరో ఆమెకు తెలియ జెప్పి ఆమె ప్రేమను సంపాదించ టానికి బదులు అతను ధనగుప్తుడి దయ్యం లాగా నటించి వెళ్ళిపోవటాని కేమిటి కారణం? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కుమారవర్మ తనను తాను బయట పెట్టుకోకపోవటానికి ఒకటి కాదు, మూడు కారణాలు కనిపిస్తున్నాయి. మొదటిది, కుమారవర్మ ధని కుడు కాడు. అతను కూడా తనను డబ్బు చూసే ప్రేమిస్తున్నాడని కళ్యాణి అనుకో వచ్చు. ఆమె తానై ఒక పేదవాణ్ణి ప్రేమించింది, నిజమే. కాని ఆమె ప్రేమకు పాత్రుడైన వజ్రపాలుడు కుమారవర్మకు ఎంత హీనుడుగా కనిపించాడంటే, కళ్యాణి ప్రేమ కోసం వాడితో పోటీ పడటం అతనికి అవమానంగా తోచింది. అది రెండవ కారణం. మరొకటి కూడా ఉన్నది. తాను మామూలు మనిషేనని తెలిస్తే, తన చేతిలో చిత్తుగా ఓడిపోయిన వజ్రపాలుడి పై కళ్యాణి కుండిన ప్రేమ కాస్తా విరిగిపోయే అవకాశం ఉన్నది. కాని తాను దయ్యమని అనుకున్న పక్షంలో కళ్యాణి వజ్రపాలుడి ఓటమిని క్షమించి అతన్ని పెళ్ళాడ గలుగుతుంది. ఈ విషయాలన్నీ ఆలోచించి కుమారవర్మ దయ్యం లాగా నటించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# పేదఇంటి పెళ్ళి

ఒకసారి పాపన్న పని మీద బస్తీకి బయలు దేరాడు. దారిలో ఒక చిన్న కాలవ ఉన్నది. ఆ కాలవలోకి దిగుతూండగా అతని కాలి కేదో మూట తగిలింది. విప్పి చూస్తే దాని నిండా వరహాలున్నాయి. బస్తీ వాళ్ళెవరో దాన్ని పారేసుకుని ఉంటారనీ, అది ఎవరి దయిందీ బస్తీలో తప్పక తెలుస్తుందనీ, వారి మూట వారికి చేర్చవచ్చుననీ అనుకుని పాపన్న ఆ మూట తీసుకున్నాడు.

అతను బస్తీకి వచ్చిన పని త్వరలోనే అయిపోయింది. ఫలాని వారిది వరహాల మూట పోయిందని ఎవరూ అనుకోవటం పాపన్న చెవుల పడలేదు. అతను ఇంటికి పోయే ఉద్దేశంతో తిరిగి వస్తూ, దాహం వేసి మంచి నీళ్ళ కోసం ఒక ఇంటి వసారాలోకి అడుగు పెట్టేసరికి, "ఆ తినే విషమేదో నాకూ, పిల్లలకూ కూడా పెట్టి మరీ తినండి," అని ఇంటావిడ ఏడుపు గొంతుతో అనటం అతని చెవుల పడింది. ఈ మాటలు వింటూనే పాపన్న లోపలికి పోయి, తన దాహం మాట కూడా మరిచి, "అంత పని చెయ్యకండి. ఏమిటి మీకు వచ్చి పడిన కష్టం?" అని అడిగాడు.

ఆ ఇంటి యజమానికి ముగ్గురు కూతుళ్ళున్నారు. ఇద్దరికి పెళ్ళీడు మించి కూడా పోయింది. ముగ్గురికీ పెళ్ళిళ్ళు చెయ్యాలి. నూరేసి వరహాలైనా కట్నం ఇవ్వక పోతే ఎవరూ చేసుకునేటట్టు లేరు. పెళ్ళి ఖర్చులకే లేని వాడు కట్నా లెక్కడ తెచ్చి పోస్తాడు? పిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యక ఎంత కాలం తాత్సారం చేస్తాడు? ఇదీ ఆ గృహస్థు సమస్య.

"ఖర్చు గురించి విచారించకండి. ఈ వరహాల మూట తీసుకుని మీ పిల్లలు ముగ్గురికీ పెళ్ళిళ్ళు చేసెయ్యండి," అన్నాడు పాపన్న. తనకా మూట దొరికింది వీరి కోసమే

అయి ఉంటుందని అతను అనుకున్నాడు. ఇంటావిడ పరమానందంతో, "ఎవరు, బాబూ, నువు? పరోపకారి పాపన్న లాగా ప్రత్యక్ష మయావు?" అన్నది.

"ఔనమ్మా, నేను పాపన్ననే!" అంటూ పాపన్న వారి వద్ద సెలవు తీసుకుని తన గ్రామానికి బయలు దేరాడు.

గృహస్థు కూడా తాను ఎన్నుకుని ఉన్న అల్లుళ్ళకు కట్నా లిచ్చేసి ముహూర్తం పెట్టించు కోవటానికి డబ్బు తీసుకుని బయలుదేరాడు.



పాపన్న వరహాల సంచీ దొరికిన కాలవ దగ్గిరికి తిరిగి వచ్చేసరికి ఎక్కడో ఎవరో మూలుగు తున్నట్టు వినిపించింది. అతను రాళ్ళ గుట్టల మధ్య వెతకగా ఒక మనిషి కనిపించాడు. అతను గాయాలు తగిలి ఒళ్ళు తెలిసీ తెలియని స్థితిలో ఉన్నాడు. పాపన్న ఆ మనిషిని ఎత్తుకుపోయి కాలవ నీటితో అతని ముఖం తుడిచి, నీళ్ళు తాగించి, గాయాలు కడిగిన మీదట ఆ మనిషి, తాను వేకువ జామున బస్తీకి పోతుండే గిట్టని వాళ్ళు పైన పడి హత్య చేయ యత్నించా రని చెప్పాడు. తన స్వగ్రామం అయిదారు కోసుల దూరం ఉన్నదని ఆ మనిషి చెప్పటం చేత పాపన్న చేసేదిలేక, అతన్ని తన ఇంటికే మోసుకుపోయి, వైద్యుణ్ణి పిలిపించి చికిత్స చేయించాడు.

ఆ మనిషి పాపన్నతో నిజం చెప్పలేదు. ఆ తెల్లవారు జామున ఒక షావుకారు తాను బస్తీలో వసూలు చేసిన బాపతు సొమ్ము నాలు గైదు వేల వరహాలు మూటలు కట్టి ఇద్దరు నౌకర్లతో సహా తీసు కొస్తుంటే, ముగ్గురు దొంగలు కాలవ సమీపంలో ఉన్న రాళ్ళ గుట్టల మాటున ఉండి అమాంతంగా వాళ్ళ మీద పడ్డారు. అయితే షావుకారు వెంట ఉన్న నౌకర్లలో ఒకడు బలాఢ్యుడు. వాడు చేతి కర్ర తిప్పి ఒక దొంగను తల మీదా భుజం మీదా బలంగా కొట్టాడు.



59



మిగిలిన ఇద్దరు దొంగలూ పిక్క బలం చూపారు. దెబ్బ తిన్న దొంగ ఎలాగో కొంత దూరం రాళ్ళ గుట్టల మధ్యకు దేక్కుంటూ పోయి, అక్కడ స్పృహతప్పి పడిపోయాడు.

ఆ గల్లంతులో ఒక వరహాల మూట పడి పోయి, పాపన్నకు దొరికింది. పాపన్న ఆ మూట ఎత్తుకునే సమయానికి రాళ్ళ గుట్టల మధ్య పడి ఉన్న దొంగకు స్పృహ లేదు. అతను బస్తీ నుంచి తిరిగి వచ్చే సమయానికి కొంచెం స్పృహ వచ్చి, బాధ తెలిసి మూలగటంచేత పాపన్నకు అతను దొరికాడు.

షావుకారు తీరా ఇంటికి వెళ్ళి చూసు కుంటే తాను తెచ్చిన మూటల్లో ఒక వరహాల మూట కనిపించలేదు. ఆయన బస్తీకి తిరిగి వచ్చి, తనను దారిలో ముగ్గురు దొంగలు కొట్టి వరహాల మూట అపహరించినట్టు కొత్వాలుతో ఫిర్యాదు చేశాడు.

ఆ ఉదయమే ఒక పేద గృహస్థు ఒక్క సారిగా తన ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళి ప్రయత్నాలు సాగించాడని కొత్వాలుకు తెలియ వచ్చింది. ఆ గృహస్థును కొత్వాలు పిలిపించి అడగగా, తనకు పరోపకారి పాపన్న అనే ఆయన వరహాల సంచీ ఇచ్చాడనీ, సంచీ ఇంకా తన వద్దనే ఉన్నదనీ అన్నాడు. సంచీ తెప్పించి చూస్తే దాని పైన షావుకారు వేసుకున్న గుర్తు కూడా ఉన్నది.

పరోపకారి పాపన్న పేరు కొత్వాలు విని ఉన్నాడు. ఈ పాపన్న అనే వాడు దొంగ తనాల మూలాన డబ్బు గడించి పరోపకారి అని పేరు తెచ్చుకుంటున్నాడని ఇప్పు డాయనకు అనుమానం కలిగింది. ఆయన తన భటులను పాపన్న ఉండే గ్రామానికి పంపించి అతణ్ణి పిలిపించాడు.

తనకు దొంగతనం గురించి ఏమీ తెలియ దనీ, తన కా సంచీ కాలవ దగ్గిర దొరికిం దనీ, అది ఎవరిదని వాకబు చేసేలోగా ఒక కుటుంబం ఆత్మహత్యా యత్నంలో ఉన్నట్టు తెలిసి, వారిని కాపాడటానికి ఆ సంచీ

ఇచ్చేశా ననీ పాపన్న ఉన్నది ఉన్నట్టు కొత్వాలుకు చెప్పాడు.

ఈ మాటలు షావుకారుకు గాని కొత్వాలుకు గాని రుచించలేదు. షావుకారు సొమ్ము 500 వరహాలు ఎవరికో దత్తమయి పోయింది. దొరికిన సొమ్ము తనకు వప్పగించక సొంత డబ్బులాగా పాపన్న వాడుకుని ఉండటం నేరమేనని నిర్ణయించి కొత్వాలు పాపన్నను ఖైదులో పెట్టించాడు. షావుకారు సొమ్ము షావుకారుకు ముట్టేదాకా గృహస్థును కూడా ఖైదులో ఉంచాలని కొత్వాలు యత్నించాడు గాని, పాపన్న ఆయనను బాధించ వద్దనీ, షావుకారు గారి డబ్బు తిరిగి ఆయనకు ఇవ్వవలసిన పూచీ తనదేననీ అన్నాడు.

అతను గృహస్థుతో, "అయ్యా, ఒక్క ఉపకారం చెయ్యండి. 500 వరహాల కోసం నన్ను ఖైదు చేశారనీ, ఆ మొత్తం చెల్లించిన దాకా నేను ఖైదులో ఉండాలనీ నా భార్యకు కబురు చెయ్యండి. మా ఇంట ఒక జబ్బు మనిషి ఉన్నాడు. పాపం అతనికి ఏ ఇబ్బందీ కలగ కుండా చూసుకోమనండి," అన్నాడు.

ఆ గృహస్థు పాపన్నకు పట్టిన దురవస్థకు కంట నీరు పెట్టుకుంటూ తానే బయలుదేరి



వెళ్ళి మీనాక్షికి సమాచారమంతా చెప్పాడు. దెబ్బలతో తీసుకుంటున్న మనిషిని చూసి ఆయన, "పాపన్నగారు నిజంగా మనిషి కారండీ! దేవుడండీ! ఇంత ఆపదలోనూ ఈ మనిషి మాట చెప్పి, ఏ లోటూ జరగ కుండా చూడమన్నారండీ!" అన్నాడు.

మీనాక్షి అంతా విని, "సరే, బాబూ! మీరు వెళ్ళి మీ అమ్మాయిల పెళ్ళిళ్ళ పని చూసుకోండి. దేవుడి దయ ఉంటే 500 వరహాలు పుట్టకపోతాయా?" అన్నది.

గృహస్థు మీనాక్షితో, "అమ్మా, నాకు పాపన్నగారిచ్చిన డబ్బులో ఇంకా సగం అలాగే ఉంది. కట్నాలు ముందే ఇచ్చేశాను

గనక పెళ్ళి ఖర్చులు ఎప్పుడు చిక్కితే అప్పుడే చూచుకోవచ్చు. ఇంకొక్క రెండు వందల వరహాలు సంపాదించ గలిగితిమా, పాపన్నగారికి బంధ విముక్తి కలుగుతుంది," అన్నాడు.

"అలాటి మాట మనసులో కూడా అనుకోకండి. వారీ మాట వింటే చాలా బాధపడతారు. ఆయన ఎంతమందికో సహాయపడ్డారు. ఎన్నడూ స్వార్థం చూసుకో లేదు," అన్నది మీనాక్షి.

తలవని తలంపుగా మూలుగుతున్న దొంగవాడు గృహస్థుతో, "అయ్యా, బండి ఒకటి మాట్లాడతారా? నే నింటికి పోతాను. నా ప్రాణం కాపాడిన ఆ పెద్దమనిషి జైల్లో ఉండగా నే నాయనకు అతిథిగా ఎలా ఉండను?" అన్నాడు.

మీనాక్షి అతన్ని పోవద్దని వేడుకున్నది.

"గాయాలన్నిటికీ కట్లు కట్టించారు కాదమ్మా? ఇంక మీరు చేసేది మాత్రం ఏమున్నది? నన్ను వెళ్ళ నివ్వండి," అన్నాడు దొంగ.

మీనాక్షీ, గృహస్థూ కలిసి దొంగను బండీలోకి ఎక్కించి పడుకోబెట్టారు. దొంగ గృహస్థును కూడా ఎక్కమన్నాడు. బండి తిన్నగా దొంగలుండే ఊరికి పోయింది. దెబ్బ తిన్న దొంగ తన తోడు దొంగలతో చెప్పి గృహస్థుకు 500 వరహా లిప్పించాడు. గృహస్థు వాటిని తెచ్చి షావుకారుకిప్పించి, పాపన్నను ఖైదు విడిపించాడు.

గృహస్థు, "మా ప్రాణాలు కాపాడారు. మా ఇల్లు నిలబెట్టారు!" అనటం విని పాపన్న, "మీకు నిజంగా ఉపకారం చేసింది నేను కాదు, ఆ దెబ్బలు తిన్న మనిషి! అటువంటి వాడికే శత్రువులు జాస్తి!" అని చెప్పి, పిల్లల పెళ్ళిళ్ళు సుఖంగా జరగాలని ఆశీర్వదించి, ఇంటికి తిరిగి వచ్చేశాడు.

అంత త్వరలో తన భర్త తిరిగి రావటం చూసి మీనాక్షి ఆనందబాష్పాలు రాల్చింది.






సేతువు నిర్మించమని రాముడు అనతి ఇవ్వగానే లక్షల సంఖ్యలో వానరులు అరణ్యాలకు పోయి, సాలవృక్షాలనూ, అశోక వృక్షాలనూ, బిల్వ వృక్షాలనూ, మామిడి చెట్లనూ, ఇంకా అనేక రకాల చెట్లనూ పీకి తెచ్చి సముద్రం పైన వేశారు. తాటి, కొబ్బరి, తుమ్మ, పొగడ మొదలైన చెట్లను కూడా తెచ్చి సముద్రం మీద విసిరి వేశారు. ఏనుగు లంతేసి కొండరాళ్ళను యంత్రసహాయంతో చేర్చారు. అంతేసి రాళ్ళు వచ్చి పడుతుంటే సముద్రపు నీరు ఆకాశ మెత్తు లేచి పడింది. సేతువు సమంగా ఉండేటట్టు చూడటానికి కొందరు తాళ్ళు పట్టుకున్నారు, కొందరు కర్ర బద్దలు పట్టుకున్నారు, కొందరు హెచ్చు తగ్గులు పరీక్షించారు. ఈ విధంగా వానరులు పది ఆమడలు వెడల్పు, నూరు ఆమడలు నిడివీ గల సేతువును నిర్మించారు.

సేతువును నిర్మించటంలో నళుడికి తోడ్పడిన వానరులు పెద్ద పెద్ద కొండల్లాటి రాళ్ళను ఎత్తుకుని పరిగెత్తుకు వస్తుంటే చూడటానికి ఆశ్చర్యకర మనిపించింది. వారు మొదటి రోజు పథ్నాలుగామడలూ, రెండవ రోజు ఇరవై ఆమడలూ, మూడో రోజు ఇరవై ఒక్క ఆమడలూ, నాలుగో రోజు ఇరవై రెండామడలూ, అయిదో రోజు ఇరవై మూడామడలూ సేతువు నిర్మించి, అయిదు రోజులలోగా సువేలపర్వతాన్ని చేరుకున్నారు.

వానరులు సంతోషంతో గెంతుతూ, అరుస్తూ, కోట్ల సంఖ్యలో సముద్రాన్ని



సేతువు మీదుగా దాటి సముద్రపు దక్షిణ తీరాన్ని చేరుకున్నారు.

విభీషణు డొక గద తీసుకుని, శత్రువు లెవరైనా వస్తే హత మార్చటానికి సిద్ధంగా తన మంత్రులతో సహా ఆ దక్షిణతీరాన నిలబడి ఉన్నాడు.

రామలక్ష్మణులను హనుమంతుడూ, అంగదుడూ భుజాల మీద ఎత్తుకుని వారధి దాటించారు. అక్కడ అందరూ రాముడికి వేరువేరుగా మంగళాభిషేకం చేశారు. వారతన్ని శత్రువులందరినీ సంహరించి, చిరకాలం భూమండల మంతా ఏలవలసిం దని మంగళవాక్యాలతో ఆశీర్వదించారు.

రాముడు లక్ష్మణుడితో, "మనం ఆలస్యం చెయ్యరాదు. వెంటనే లంకకు బయలుదేరి పోదాం," అన్నాడు. రాముడు ధనుర్ధారి అయి ముందు నడుస్తూంటే వానరసేన వెనకగా కదిలింది. విభీషణ, సుగ్రీవాది ప్రముఖులు సింహనాదాలు చేస్తూ కదిలారు.

ఇక్కడ వానరసేన విడియగానే లంకలో నుంచి భేరీ మృదంగ ధ్వనులు భయంకరంగా వినవచ్చాయి. వాటిని విని వానరులు అంతకన్న గట్టిగా సింహనాదాలు చేశారు. ఆ ధ్వనిని లంకలోని రాక్షసులు విన్నారు.

రకరకాల ధ్వజాలతోనూ, పతాకలతోనూ కూడి ఉన్న లంకానగరాన్ని చూసి రాముడు, "ఇక్కడనేగదా సీత జింక పిల్లలాగా రావణుడి నిర్బంధంలో ఉన్నది!" అని దిగులుగా అనుకుని, లక్ష్మణుడితో, "ఆ త్రికూట పర్వతం మీద విశ్వకర్మ నిర్మించిన లంకా నగరాన్ని చూడు. అనేక పెద్ద భవనాలతో ఇది తెల్లని మబ్బులుగల ఆకాశంలా గున్నది. మంచి మంచి సుందర వనాలతో అందంగానూ, రకరకాల పక్షుల కూతలతో ఎంతో ఆహ్లాదకరంగానూ ఉన్నది," అన్నాడు.

తరవాత రాముడు వానరసేనను గరుడ వ్యూహంలో అమర్చి, దానికి ముందు తానూ

లక్ష్మణుడూ ఉండేటట్టూ, అంగదుడు నీలుడితో బాటు తన సేనతో సహా హృదయ స్థానంలో ఉండేటట్టూ, ఋషభుడు తన సేనతో కుడిపక్కా, గంధమాదనుడు ఎడమ పక్కా ఉండేటట్టూ, జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శీ కడుపుస్థానంలో ఉండేటట్టూ, సుగ్రీవుడు వెనుక భాగాన్ని రక్షించేటట్టూ ఏర్పాటు చేశాడు.

వ్యూహం ఏర్పాటు కాగానే రాముడి ఆజ్ఞపై సుగ్రీవుడు శుకుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. వాడు అక్కడ క్షణమైనా ఉండక రావణుడి దగ్గిరికి వెళ్ళాడు. రావణుడు వాణ్ణి చూసి నవ్వుతూ, "ఎవరో నీ రెక్కలు విరిచినట్టున్నారు. నీవు కోతులకు చిక్క లేదు కద?" అన్నాడు.

"నేను సముద్రం దాటి వెళ్ళి, సుగ్రీవుణ్ణి చూసి, తమరు చెప్పమన్నట్టుగానే చెప్పాను. ఆ వానరులు నన్ను చూసి మండిపడి, ఆకాశంలోకి ఎగిరి నన్ను పట్టుకుని, నానా హింసలూ పెట్టి, చంపటానికి సిద్ధపడ్డారు. వాళ్ళు అమిత కోప స్వభావులూ, క్రూరులూనూ. వాళ్ళతో మాట్లాడటమే కష్టం, ఇంక జవాబు చెప్పించటం ఎట్లా? రాముడు లంకా ద్వీపానికి చేరాడు. సముద్రానికి సేతువు నిర్మించి లంకాద్వారం



దాకా వచ్చాడు. వానరసేనలు ఇసుక వేస్తే రాలకుండా ఉన్నాయి. వెంటనే సీతను రాముడి కిచ్చెయ్యటమో, యుద్ధానికి సిద్ధం కావటమో, ఏదో ఒకటి చెయ్యాలి," అన్నాడు శుకుడు.

రావణుడు శుకుడితో తాను యుద్ధానికే నిశ్చయించుకున్నట్టు చెప్పి, వానర సేన యొక్క వివరాలన్నీ రహస్యంగా తెలుసుకు రమ్మని శుకసారణులను పంపాడు. వారు వానర రూపాలు ధరించి వానరసేన ప్రవేశించారు.

వాళ్ళకు వానరసేన అంతు చిక్కలేదు. పర్వత శిఖరాల మీదా, పర్వతాల మధ్యా,



అరణ్యాలలో, సముద్రతీరానా, వనాలలో, ఉద్యానాలలో ఎక్కడ చూసినా వారికి వానరసేన కనిపించింది. ఆ సేనలో ఒక భాగం ఇంకా సేతువు దాటుతూనే ఉన్నది!

ఇంతలో శుకసారణుల మాయా రూపాలను విభీషణుడు పోల్చుకుని, వారిని పట్టుకుని రాముడితో, "వీళ్ళు శుకసారణులనేవారు. రావణుడి మంత్రులు. మన రహస్యాలు తెలుసుకు పోవటానికి లంక నుంచి వచ్చారు," అని చెప్పాడు.

రావణుడు పంపగా వానరసేనను గురించి తెలుసుకోవటానికి వచ్చినట్టు శుకసారణులు ఒప్పుకున్నారు.



రాముడు నవ్వుతూ, "ఇకనేం? సైన్యమంతా చూసుకోండి. మమ్మల్ని చూడండి. చూడవలసిన దంతా చూశాక స్వేచ్ఛగా లంకకు వెళ్ళిపొండి," అని వారితో అన్నాడు. వాళ్ళు నిరాయుధులు కనక వారిని చంపనని కూడా అతనన్నాడు. అతను రావణుడితో తన మాటలుగా ఇలా చెప్పమన్నాడు: "నీవు ఏ ధైర్యంతో నా భార్యను సీతను అపహరించావో ఆ ధైర్యాన్ని ఇప్పుడు ప్రదర్శించు. రేపు తెల్లవారుతూనే లంకా ప్రాకారాన్నీ, ద్వారాలనూ, నీ రాక్షస సైన్యాన్నీ నా బాణాలతో నుగ్గు చెయ్యబోతున్నాను. జాగ్రత్త!"

శుకసారణులు రాముణ్ణి పొగడి లంకకు తిరిగి వెళ్ళి రావణుడితో, "రాజా, మేము వానరసేనలో ప్రవేశించి విభీషణుడికి పట్టుబడ్డాం. అయితే ధర్మాత్ముడైన రాముడు మమ్మల్ని విడిచిపెట్టాడు. వానరసేనకు రాముడూ, లక్ష్మణుడూ, విభీషణుడూ, సుగ్రీవుడూ చాలు—వారు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోరు. లంకకు చేటు తీసుకురావటానికి ఆ నలుగురే చాలు, మిగిలిన వానరసేన అనవసరమనిపిస్తుంది. రాముడి రూపమూ, ఆయుధాలూ చూస్తే అతనొక్కడే చాలు, లక్ష్మణ విభీషణ సుగ్రీవు



లెందుకనిపిస్తుంది. ఇక వానర వీరులు యుద్ధోత్సాహులై, ఎప్పుడా అన్నట్టున్నారు. అందుచేత వాళ్ళతో విరోధం పెట్టుకోవటం కన్న సీతను రాముడి కిచ్చెయ్యటం మంచిది," అన్నారు.

ఈ మాటలు విని రావణుడు సారణుడితో, "అన్ని లోకాలూ ఒక్క పెట్టున నా పైకి ఎత్తివచ్చి భయపెట్టినా నేను సీతను పోనివ్వను. నీవు మెత్తని వాడవు కావటం చేత వానరుల దెబ్బలకు బెదిరిపోయి సీత నిచ్చెయ్యమంటున్నావు," అని, శుకసారణులను వెంటబెట్టుకుని మంచు కొండలాటి తెల్లని తన భవనం పైకి ఎక్కి, అక్కడి నుంచి కనిపించే పర్వతాలూ, వనాలూ, సమస్తమూ వానరసేనతో నిండి ఉండటం గమనించాడు.




అతను సారణుడి కేసి తిరిగి, "వానరులలో శూరులూ, బలవంతులూ అయిన వారెవరు? అగ్రనాయకు లెవరు? ముఖ్యు లెవరు?" అని అడిగాడు.

"లంక కేసి తిరిగి సింహనాదం చేస్తున్న ఆ వానరుడు నీలుడు; వానర సేనా నాయకుడు, చేతులు పైకెత్తి నిలబడి, తోకను నేల కేసి కొట్టుతున్నవాడు అంగదుడు; సుగ్రీవుడి చేత యువరాజుగా అభిషేకం చేయించుకున్నవాడు; వాలి కొడుకు. హనుమంతుడు లంకకు వచ్చి సీతను చూసిన వాడే. అంగదుడికి వెనకగా ఉన్న వాడు నళుడు; అతనే సముద్రానికి సేతువు కట్టినది! తానొక్కడే లంకను జయించాలని ఇతని అభిలాష. సైనికులను సర్దుతూ, ఉత్సాహపరుస్తూ తిరిగే ఆ తెల్లని వానరుడే శ్వేతుడు. అడుగో, అతను కుముదుడు, చాలా తీవ్రస్వభావం గలవాడు, భయంకరుడు. ఆ వానరుడు రంభుడు. ఆ ఆవలించే వాడు శరభుడు; అతనికి చావంటే లక్ష్యం లేదు: యుద్ధంలో వెనకడుగు వెయ్యడు," అని చెబుతూ సారణుడు



రావణుడికి ఒక్కొక్క వానర ప్రముఖుణ్ణీ పరిచయం చేశాడు.

సారణుడు చెప్పేది పూర్తి అయాక శుకుడు మరి కొందరు శత్రు ప్రముఖులను గురించీ, వారి ఘనతను గురించీ రావణుడికి వివరించి చెప్పాడు.

తన మంత్రులు శత్రువీరులను ఆవిధంగా తెగ పొగడటం విని రావణుడికి ఆగ్రహం కలిగింది. అతను వారితో, "నా ఉప్పు తిని బతికే వాళ్ళు నాకు అప్రియంగా ఇలా మాట్లాడవచ్చా? ఒక వంక యుద్ధం జరగ బోతుండగా శత్రువుల నిలా పొగడవచ్చా? పెద్దల దగ్గిర మీరేం నేర్చుకున్నట్టు? మీరు చదివిన నీతి శాస్త్రమంతా ఏమైనట్టు? మిమ్మల్ని చంపెయ్యవలిసిందే, కాని మీరు లోగడ చేసిన మేలు తలచి మిమ్మల్ని విడిచిపెట్టేస్తున్నాను. అదే మీకు మృత్యువుతో సమానం," అన్నాడు.

ఈ మాటలకు సిగ్గుపడి, శుకసారణులు రావణుడికి జయం పలికి వెళ్ళిపోయారు.

రావణుడు మహోదరు డనేవాణ్ణి పంపి వేగులవాళ్ళను పిలిపించి, వారితో, "మీరు రాముడి వద్దకు వెళ్ళి, అతని ప్రయత్నాలేవో, అతని అంతరంగికులెవరో తెలుసుకోండి. రాముడు ఎప్పుడు పడుకుంటాడో, ఎప్పుడు మేలుకుంటాడో, ఏంచేస్తాడో, సమస్తమూ తెలుసుకురండి. మీరు తెలుసుకు వచ్చే విషయాలు యుద్ధంలో మనం సులువుగా గెలవటానికి సహాయంకావాలి," అన్నాడు.

ఆ చారులు శార్దూలుడనే వాణ్ణి వెంట బెట్టుకుని, మారు రూపాలతో, సువేల పర్వత సమీపంలో రామ లక్ష్మణ విభీషణ సుగ్రీవులున్న చోటికి చేరుకున్నారు. రామలక్ష్మణులనూ, వానరసేననూ చూడగానే వారికి భయం వేసింది.

విభీషణుడు వాళ్ళను పోల్చనే పోల్చాడు. వారిలో శార్దూలుడు మరీ దుష్టుడు. విభీషణుడు చారులను పట్టుకుని, శార్దూలుణ్ణి

వానరులకు అప్పగించాడు. వానరులు వాణ్ణి చంపబోతుంటే రాముడు అడ్డుపడి, శార్దూలుణ్ణీ, మిగిలిన చారులనూ కూడా విడిపించాడు. వారు లంకకు తిరిగి వెళ్ళి, రాముడు సేనతో సహా సువేల పర్వతప్రాంతంలో ఉన్నాడని రావణుడికి చెప్పారు.

రావణుడు శార్దూలుణ్ణి చూసి, "నీ ముఖం అలా వాడిఉన్నదేమిటి? శత్రువులు నిన్నేమీ చెయ్యలేదు గద?" అని అడిగాడు.

శార్దూలుడు రావణుడితో, "ఆ వానరుల మీద వేగు చెయ్యటం చాలా కష్టం. నేను వానరసేనలో ప్రవేశించానో లేదో, నన్ను పట్టుకున్నారు. విభీషణుడి మంత్రులు నన్ను హూనం చేసేశారు. ఆ తరవాత వానరులు నన్ను పొడిచి, కరిచి, కొట్టి చాలా విధాల బాధించి సేనచుట్టూ తిప్పారు. నేను రక్తంకారి, స్పృహతప్పి, చావటానికి సిద్ధంగా ఉండగా రాముడు నన్ను కాపాడాడు. అతను త్వరలోనే లంకను ముట్టడించనున్నాడు. ఇస్తావా సీతను ఇచ్చెయ్యి, లేదా యుద్ధానికి సిద్ధంకా!" అన్నాడు.

రావణుడు శార్దూలుడి చేత కూడ వానర ప్రముఖులను గురించి చెప్పించుకుని, తన మంత్రులను పిలిపించి వారితో కార్యాలోచన చేశాడు. అతను కర్తవ్యం నిర్ణయించుకుని, మంత్రులను పంపేసి, మాయలలో ఆరితేరిన విద్యుజ్జిహ్వుణ్ణి వెంటబెట్టుకుని, సీత వద్దకు బయలుదేరాడు.

అతను విద్యుజ్జిహ్వుడితో, "మనం మాయ చేత సీతను మోసపుచ్చాలి. నీవు మాయ చేత రాముడి తలను కల్పించి, ధనుర్బాణాలతో సహా దాన్ని తీసుకుని నా వెంట రా," అన్నాడు.

విద్యుజ్జిహ్వు డందుకు సమ్మతించి, రావణుడు బహుమానంగా ఇచ్చిన అభరణాన్ని తీసుకుని వెళ్ళిపోయాడు. రావణుడు అశోకవనంలో రాక్షస స్త్రీల మధ్య ఉన్న సీత వద్దకు బయలుదేరి వెళ్ళాడు.





# ధ్రువచరిత్ర

మనువులలో మొదటి వాడైన స్వాయంభువుడికీ, ఆయన భార్య అయిన శతరూపకూ ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ అని ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో ఉత్తానపాదుడికి సునీతీ, సురుచీ అని ఇద్దరు భార్యలు. సునీతికి, ధ్రువుడూ; సురుచికి ఉత్తముడూ అని ఇద్దరు కుమారులు కలిగారు.

ఉత్తానపాదుడికి తన చిన్న భార్య అయిన సురిచి అంటే ఎక్కువ ఇష్టంగా ఉండేది. అందుచేత ఆయన తన పెద్ద భార్యను లక్ష్యపెట్టక, సురుచికి వశుడై ఉండేవాడు.

ఒకనాడు ఉత్తానపాదుడు తన చిన్న భార్య కొడుకైన ఉత్తముణ్ణి తొడపై కూర్చొబెట్టుకుని ముద్దులాడుతూండగా అయిదేళ్ళ వాడైన ధ్రువు డక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, తానుకూడా తండ్రి తొడపై కూర్చోవటానికి యత్నించాడు. ఉత్తానపాదుడు ధ్రువుణ్ణి వారించాడు.

అది చూసి సురుచికి ధ్రువుడంటే మరింత అలుసై, "తండ్రి ఒడి యెక్కలేని వాడివి రేపు తండ్రి సింహాసనం ఏమెక్క గలవురా? కుర్రతనం చేత దురాశ బయట పెట్టుకున్నావు! రాజ్యం కావాలంటే తపస్సు చేసి నా కడుపున పుట్టాలిరా!" అని అవహేళనగా మాట్లాడింది.

సవతి తల్లి ఇలా అన్నందుకు ధ్రువుడికి పట్టరాని కోపమూ, ఆమె అలా అవహేళన చేస్తూ ఉంటే తండ్రి చూస్తూ ఊరుకున్నందుకు పట్టరాని దుఃఖమూ ముంచుకు వచ్చాయి. అతడు ఏడుస్తూ తన తల్లి దగ్గిరకు వెళ్ళాడు.

పుట్టెడు దుఃఖంతో తన వద్దకు వచ్చిన ధ్రువుణ్ణి తల్లి దగ్గిరికి తీసి, ఒళ్ళో కూర్చొబెట్టుకుని, బుజ్జగిస్తూ అతని దుఃఖానికి

కారణం తెలుసుకున్నది. తన సవతి అన్న మాటలు తలచుకున్న కొద్దీ ఆమెక్కూడా దుఃఖం ఆగలేదు.

ఆమె తన కొడుకుతో, "మనకు బాధ కలిగినప్పుడు ఇతరులను నిందించటం పొరపాటు. పూర్వ జన్మలో ఇతరులకు బాధ కలిగించి, ఈ జన్మలో బాధపడతాం. నీ తండ్రికి నేను తన భార్యనని చెప్పుకోవటమే సిగ్గయినప్పుడు సురుచి అలా మాట్లాడటం తప్పా? నిర్భాగ్యురాలిని, నా కడుపున పుట్టిన నీపై నీ తండ్రికి ఆదరం ఎందుకుంటుంది? నీకు నిజంగా రాజ్యమే కావాలంటే సురుచి చెప్పినట్టు తపస్సు చెయ్యి. అన్ని కష్టాలూ ఆ విష్ణువే తీరుస్తాడు," అన్నది.

తల్లి ఈ మాట అనగానే ధ్రువుడు మనో నిశ్చయంతో తపస్సు చేసుకోవటానికి బయలుదేరాడు. ఆ కుర్రవాడికి నారదు డెదురుపడి, తల నిమిరి, ఆశ్చర్యంతో, "నీ కిప్పుడే ఎంత క్షాత్రంరా? నీ సవతి తల్లి సూటీ పోటీ మాట లన్నదని ఇల్లు విడిచి ఒంటరిగా బయలుదేరావా? ఎక్కడికి పోతావు?" అని అడిగాడు.

"మునీంద్రా, సురుచి అన్న మాటలకు నా మనస్సులో తీరని గాయ మయింది," అన్నాడు ధ్రువుడు.



"మానావమానా లేమిటో అర్థమయే వయసు నీకు లేదు. తల్లి మాట విని విష్ణువు గురించి తపస్సు చేద్దా మనుకున్నావు. ఎన్నో జన్మల తరబడి తపస్సు చేసినవారు కూడా విష్ణు సాక్షాత్కారం పొందలేక పోయారు. అందుచేత ప్రస్తుతానికి ఈ ప్రయత్నం మాను. మంచి సమయం వచ్చినప్పుడు చూసుకోవచ్చు," అన్నాడు నారదుడు.

"స్వామీ, సురుచి మాటలు బాణాల లాగా గుచ్చుకుని బాధ పెడుతున్న నాకు మీ హిత వాక్యాలు తల కెక్కటం లేదు. ఉత్తమ పదాన్ని అందుకునే తేలిక మార్గం నాకు బోధించండి," అన్నాడు ధ్రువుడు.

ధ్రువుడి నిశ్చల బుద్ధికి మెచ్చుకుని నారదుడు, "నాయనా, యమునా తీరాన మధువనానికి వెళ్ళి, కాళిందీ జలంలో స్నానం చేసి, ద్వాదశాక్షర మంత్రం జపిస్తూ ఏకాగ్ర చిత్తంతో హరిని ధ్యానించు. విష్ణువు ప్రసన్నుడై నీ కోరిక తప్పక ఈడేరుస్తాడు," అని చెప్పాడు.

ధ్రువుడు తపస్సుకై బయలుదేరాడు. నారదుడు ఉత్తానపాదుడి వద్దకు వచ్చి, ఆయన చేసిన అతిథి పూజలు స్వీకరించి, "రాజా, ఎందు కలా విచారంగా ఉన్నావు? ధర్మార్థ కామాలకు విఘాతం లేదుకదా?" అని అడిగాడు.



"మునీంద్రా, నా కొడుకు అయిదేళ్ళ వాడు, ఆడవాళ్ళ నిర్దయ వల్ల తల్లితో సహా వెళ్ళిపోయాడు. అరణ్యంలో వాణ్ణి ఏ మృగం పొట్టన పెట్టుకుంటుందో? ఆడదానికి పూర్తిగా వశుణ్ణయి, నా తొడ మీద కూర్చోబోయిన కొడుకును నిరాకరించాను," అన్నాడు ఉత్తానపాదుడు.

దానికి నారదుడు, "రాజా, వాడి కోసరం విచారించ నవసరంలేదు. వాడికి దైవ రక్ష ఉన్నది. వా డొక ఘన కార్యం చేసి, కీర్తి మంతుడై, త్వరలోనే తిరిగి వస్తాడు," అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఉత్తానపాదుడు నారదుడి మాటయందు నమ్మకం ఉంచి, రాచకార్యాలు పట్టించు. కోక, అస్తమానమూ కొడుకును గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అక్కడ ధ్రువుడు మధు వనం చేరి, కాళిందిలో స్నానం చేసి, ఆ రాత్రి ఉప వాసం ఉండి, యోగం అవలంబించి, హరి ధ్యానంలో నిమగ్నుడయాడు. అతను మొదటి నెల మూడేసి రోజుల కొకసారి ఫలాలు తిన్నాడు; రెండవ నెల ఆరేసి రోజుల కొకసారి ఆకులు తిన్నాడు; మూడవ నెల తొమ్మిది రోజుల కొకసారి నీరు తాగాడు; నాలుగవ నెల శ్వాస బంధించి పన్నెండు రోజుల కొకసారి వాయుభక్షణ చేశాడు; అయిదవ మాసం శ్వాస పూర్తిగా బంధించి ఏక పాదం మీద నిశ్చలంగా నిలిచి భగవ ధ్యానం చేశాడు.

మూడు లోకాలూ ధ్రువుడి తపస్సుకు కంపించాయి. ఈ ఉత్పాతాలు చూసి, దిక్పాలకులు భయపడి పోయి విష్ణుమూర్తి శరణుజొచ్చారు.

"ఉత్తానపాదుడి కొడుకు చేసే తీవ్ర తపస్సు వల్ల లోకాలు సంచలించాయి. మీరు భయపడకండి. నే నతని తపస్సు మాన్పి స్తాను," అని అభయ మిచ్చి విష్ణువు వారిని పంపేశాడు. —(ఇంకావుంది)



# 34. యోసిమైట్ లోయ

కాలిఫోర్నియా లోని యోసిమైట్ నేషనల్ పార్కులో (1100 చ. మైళ్ళు) ఈ లోయ ఉన్నది. దీని విస్తీర్ణం 8 చ. మైళ్ళు. మెర్సెడ్ నది కోత వల్ల ఏర్పడిన ఈ లోయ కొన్ని చోట్ల 3,000 అడుగుల లోతు కూడా ఉన్నది. ఈ లోయలో నదీ పాతాలు చాలా ఉన్నాయి. పాతా లన్నిటి మొత్తమూ కలిపితే అర మైలుంటుంది. అందులో యోసిమైట్ పాతం ఒక్కటే 1430 అడుగులు. ప్రపంచంలోని బృహజ్జలపాతాలలో ఇది ఒకటి.

ఈ పార్కులోనే "మారిపోసా" తోపు ఒకటి ఉన్నది. ఇందులో సిక్వోయియా చెట్లున్నాయి. ఇవి చాలా పెద్దవి, చాలా పురాతనమైనవి. ఇక్కడ చూపిన చిత్రం లోని చెట్టు వయసు దాదాపు నాలుగు వేల సంవత్సరాలు. బుద్ధుడు పుట్టేనాటికే ఇది 1300 ఏళ్ళకు పైబడ్డ వయస్సు గలది. దీని చుట్టు కొలత 96 న్నర అడుగులు. ఎత్తు 209 అడుగులు. "మారిపోసా" తోపులోని సిక్వోయియా వృక్షా లన్నిటిలోకీ ఇది హెచ్చు వయసు కలది.

ఈ జాతికి చెందిన వృక్షాలను సిక్వోయియా పార్కులో హెచ్చు సంఖ్యలో సంరక్షిస్తున్నారు. ఈ పార్కొక పెద్ద అడవి. ఇక్కడి చెట్లు 1916 కు పూర్వం వ్యక్తుల సొంత ఆస్తిగా ఉంటూండేవి. ఎర్ర రంగు కర్ర గల ఈ చెట్లను కోసి కలప కింద అమ్మేవారు. ప్రభుత్వం ఈ చెట్ల నన్నిటినీ కొని వాటి విధ్వంసాన్ని నిలిపివేసింది.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీవు నన్ను మేపితే

పంపినవారు:
బి. భానుమతి, భీమునిపట్నం

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

నేను నిన్ను లేపుతా

పంపినవారు :
బి. భానుమతి, భీమునిపట్నం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1964 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ సెప్టెంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నీవు నన్ను మేపితే

రెండవ ఫోటో : నేను నిన్ను లేపుతా

పంపినవారు : బి. భానుమతి,

c/o శ్రీ బి. సుబ్రహ్మణ్యం, బి.ఎ.బి.ఇడి, భీమునిపట్నం.

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా ఉండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-60 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-80 పంపండి. ప్రతి ఒక్కంటికి 15 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



## చందమామ పబ్లికేషన్సు
## వడపళని :: మదరాసు-26

కండనొప్పి

ఎంత ఎక్కువగా ఉన్నా

స్థానికమే

# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృంతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబాని కంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధినిపొందిన నమ్మకమైన గృహఔషధం.

అమృతాంజన్ <u>నొప్పులు జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

JWT/AM/2816



తాజా టీ
పరిమళమైన టీ
ఉత్తమ టీ

# టాటా-ఫిన్లే
# టీ

*సాటిలేని టీ!*

- తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

- అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

- టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే** *టీ త్రాగండి; ఆనందము అందుకోండి!*



ఈ క్రింది రకాలలోను,
ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే
టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్, లలిత్ లీఫ్ టీ,
మిలాప్ లీఫ్ టీ, బహదూర్ డస్ట్ టీ,
షాన్ డస్ట్ టీ



# దిలీపు బృందం

## తిరణాల్ల ముచ్చట






































ఛాయాచిత్ర
వారి..

# మంచి మనిషి



డైరెక్టర్ కె. ప్రత్యగాత్మ

ప్రొడ్యూసర్: కె.సుబ్బరాజు. సంగీతం: యస్.రాజేశ్వరరావు-టి.చలపతిరావు • వాణీ రిలీజ్

REVATHI

STUDIO Ketna

